निरीश्वरवादखण्डनमु.

A

# Telugu Translation

3

OF

## Annie Besant's "Why I became a Theosophist."

BY


SRIPATI SURYANARAYANA, B. A., F. T. S.

HEAD MASTER,

SAMSTHANAM HIGH SCHOOL,

BOBBILI.


---


1893.

MADRAS.

PRINTED AT THE JYOTHISHMATY PRESS,

*No. 4, Mallikeswarar Covil Street, Muthyalpet.*

ఆనీబిసాంటు

అను పేరుగల

యాంగ్లేయగ్రంథకర్త్రిగారు

నాస్తిక్యమతమును విడిచి, యోగసభలో చేరుటకుండు కారణములను,

నిరీశ్వరవాదము పయిని జేయదగిన మరికొన్ని పూర్వపక్షములను జేర్చి

వ్రాయబడిన

# నిరీశ్వరవాదఖండనము

అను పత్రిక.

శ్రీబొబ్బిలిరాజావారి యాంగ్లేయపాఠశాలా

ప్రథమోపాధ్యాయుండగు

శ్రీపతి సూర్యనారాయణశర్మచే,

తెనిగింపబడినది.

---

చెన్నపురి

(ముత్యాలపేట, మల్లికేశ్వరస్వామిగుడివీధిలో)

జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

---

౧౮౯౩.

# Preface.

---

The writer of the pamphlet of which the following is a translation, is no other than that renowned Annie Besant, who was until very recently as devout an atheist, as she is now a Theosophist. To distant observers like the Hindus, her life is full of interest in more ways than one.

Though a Christian by birth, she found Christian Theology too weak to be accepted by men of culture. Other theologies were equally weak in her eyes.

1. All that she read and thought tended only to convince her that Atheism was the only 'rock of safety.' She consequently renounced her christianity and with it, her theism, and joined that famous band of Freethinkers, headed formerly by Bradlaugh, and now by Mr. Foote. Her reasons to change christianity for atheism, are given in her well-known work called " My Path to Atheism.

2. In all those heated controversies that raged between Bradlaugh and the Bishops of England, Annie Besant played no insignificant part. Time went. Further thought and further observation, led her to see that what she at first belived to be 'the rock of safety' was in reality only 'a rock of doubt' with a large incrustation of dogmatism, and that the most important subdivisions of the great Problem of the Universe, remained as much unsolved in Atheism, as they always have been in western philosophy.

3. Meanwhile, the field of Thesophy, which was at first no larger than an islet in the Ocean, gradually widened, and its healthy and invigorating atmosphere began to be felt in the most orthodox as well as in the

most heterodox circles of Europe. Annie Besant has been one of the fortunate few that early felt the influence of Theosophy; and her very Atheism, which she now renounced for Theosophy, and for which she originally left her Christianity, has much to tell of the inherent merits of Thesophy and Vedanta Philosophy.

4. It is a rare phenomenon, full of significance as regards the spiritual future of India, that an English lady of Besant's attainments and precedents, should resort to Theosophy to satisfy her intellectual cravings. Her path to Theosophy is therefore as interesting now, as her path to Atheism once was. But as Annie Besant is a great active force wherever she is, her thoughts and words are of special interest to us, Hindus, and at present carry great weight in India, where the ancient indigenous religious thought, Christianity and Western philosophy are now at war with one another.

5. For these reasons,the translation of the pamphlet has been undertaken under the directions and auspices of my generous patron, the Rajah of Bobbili, to whom therefore the translation is dedicated by means of the verses following this preface, as a poor tribute for his numerous acts of generosity to me.

6. It only needs to be said in conclusion that this translation contains, all the matter contained in the original, but wherever Annie Besant is merely suggestive, I have ventured to supplement her by arguments and illustrations of my own, which, I trust, are not out of harmony with the tenor of the original; for, my object has been not so much to produce a faithful translation of the original, as to write a defence of the doctrine of Karma, apart from the necessity of making the translation as readable as possible.



శ్రీమద్గురుచరణారవిందాభ్యాంనమః.



శ్లో॥స్వజనబుధకదంబే స్వర్ద్రుసంకాశశీలమ్
సకలరిపుకృతాంతం స్వాశ్రితేశాంతవృత్తిమ్ ।
రతిపతిసమరూపం రంగరాయావనీపమ్
పరమశివసమేతా పాతు సా లోకమాతా॥

శ్లో॥వెలుగోటివంశసమ్భూతం రావువంశప్రదీపకమ్ ।
రంగరాయప్రభుం ప్రాజ్ఞం పాతు సా పరమేశ్వరీ॥

శ్లో॥*ప్రణమ్య మోక్షదం విద్యాదాయినం చంద్రశేఖరమ్ ।
ప్రభోరాజ్ఞానుసారేణ మయాంధ్రీక్రియతేధునా ॥

శ్లో॥ఆనీబిసాటినామ్న్యాచ విదుష్యా కాంతయా తయా।
లిఖితా హూణభాషాయా మాస్తిక్యమతబోధినీ ।
పత్రికాసు ప్రసిద్ధాచ నాస్తిక్యమతఖండనమ్ ।
కుర్వతీ యుక్తియుక్తైశ్చ పూర్వపక్షైస్సుచింతితైః॥

---

*మోక్షదం, చంద్రశేఖరమ్=శ్రీపరమశివమ్.

విద్యాదాయినం, చంద్రశేఖరమ్ = మనువిద్యాప్రదాతారం చంద్రశేఖర నామాఖ్యం గురుంచేత్యన్వయః ।



# పీఠిక.

ప్రస్తుతము మన దేశము నేలుచున్న విక్టోరియారాణీగారికి స్వదేశమయిన యింగ్లాండుదేశమందు మనదేశమందువలె యనేకమతములవారుగలరు. వారిలో క్రైస్తవులుమెండు. తక్కినవారిలో కొందరు నిరీశ్వరవాదులు. కొందరు దేహాత్మవాదులు. మరికొందరు మరికొన్ని మతములలోనున్నారు. మనదేశములోవలెగాక యచ్చటస్త్రీలు సైతము చక్కగ విద్యజదువుకొని వారివారిజ్ఞానము ననుసరించి వారికి సంతుష్టియయిన మతమును నమ్మియుందురు. అటుల జదువుకొనిన యాంగ్లేయవనితలలో నగ్రగణ్యురాలయిన (Annie Besant) అనీబిసాంటనను పేరుగల యొకనారీరత్నము కలదు. ఆమె తొల్లి క్రీస్తుమతములో కొంతకాలముండి యామతము తనకుసంతుష్టిగానుండక దానిని పరిత్యజించి నిరీశ్వరవాదములో ప్రవేశించి నిరీశ్వరవాదసార్వభౌముడయిన (Charles Bradlaugh) చార్లేసుబ్రాడ్లాదొరవారికి సహకారిణియై నిరీశ్వరవాదముతోచేరిన యనేకయంశములపైని ఉపన్యాసములు చేయుచుండెను. ఇట్లుండ నానాట యనేకగ్రంథములుచదివి నిరీశ్వరవాదసిద్ధాంతమును లెస్సగామననముచేయగా యామెకామతమందనేక సంశయములుకలిగెను. ఆసంశయములకు నిరీశ్వరవాదులు తగినయుత్తరువుజెప్ప లేమింజేసి నిరీశ్వరవాదమునువిడిచి సంవత్సరము క్రిందట మనభరతఖండీయమతములలో నొకటియయిన సాంఖ్యయోగములోప్రవేశించి యోగినీశిరోమణియగు (Blavetsky) బ్లావెట్సుకీ యనుపేరుగల వనితాగోసరితోకలిసి యోగచర్చజేయుట కారంభించెను. నిరీశ్వరవాదసిద్ధాంతమందు తనకుదోచినశంకలను యాసిద్ధాంతమునువిడిచి మతాంతరమును జేరుటకుండు ముఖ్యకారణములనుచేర్చి యామెయొకపత్రికవ్రాసి ప్రచురపరచెను. ఈపత్రిక విషయమునెనిగించి నిరీశ్వరవాదముపైని చేయదగిన మరికొన్ని పూర్వపక్షములుగూడ సందర్భానుసారముగ వ్రాయబడినవి.

ఈపూర్వపక్షములు, యోగసభవారిమతమునకు, కేవలమువిరుద్ధములుగనుక, సాహసించి. నాచేతసందర్భానుగుణ్యముగ నక్కడక్కడ వ్రాయబడినవి.

ఇదిగాక, పయినుదాహరింపబడిన బీసాంటయను గ్రంథకర్త్రిగారియొక్క యభిప్రాయము శ్రుతిస్మృతులతో నేకీభవించినచోట నెల్ల, యామెయభిప్రాయమును బలపర్చు ప్రమాణవాక్యములుగూడ దోచినంతవరకు వ్రాయబడినవి.

ఈసాహసమును క్షమించవలెనని హూణభాషాప్రవీణులు ప్రార్థింపబడుచున్నారు.

విధేయుడు,

భాషాంతరీకర్త.

# అవతారిక

ఇంగ్లాండుదేశములోనుండు మతములలో నీశ్వరవాదము, నిరీశ్వరవాదము, అను రెండుభేదములుగలవు. ఈశ్వరవాదులలో గొందరు క్రీస్తువులు. వీరు భగవంతుడుకలడని యొప్పుకొనుచు భగవంతునికొమారుడు మనుష్యులను పాపములనుంచి యుద్ధరించుటకు భూమిపైని యవతరించెనని నమ్ముదురు. ఈశ్వరవాదులలో మరికొందరు సర్వేశ్వరుడొక్కడే కలడని యొప్పుకొని యెద్దఁగాని క్రీస్తుయొక్క దేవత్వమునొప్పుకొనరు. వీరనిపరమాస్తికులనియనవచ్చును. (Unitarians). ఈయాస్తికులలో కొందరు మనుష్యునికి మనస్సుతప్ప యాత్మయనెడు పదార్థమొకటి వేరుగ లేదనియు మనముచేయుపుణ్యపాపముల కిహమందుకలుగు సుఖదుఃఖములుతప్ప, నుత్తరమందు స్వర్గనరకములు లేవనియు బోధించుదురు. వీరు దేహాత్మవాదులని యనవచ్చును. వీరికే (Materialists) మెటీరియలిస్ట్సు యనిపేరు. ఇంగ్లాండుదేశములోనుండు గొప్పపండితులలో ననేకులు దేహాత్మవాదులని యనవచ్చును. మరికొందరు గొప్ప పండితులు, భగవంతుడుగలడని యొప్పుకొనుచు నతనిస్వరూపస్వభావములు మనుష్యులకు దుర్జ్ఞేయములగుటచేత భగవద్విషయకమైన చర్చకేవలము మానుకొనుటయే యుత్తమమయిన పనియని చెప్పుదురు. వీరు కూడ మనుష్యునకు యాత్మగలదో లేదోయనుసంశయముతో నున్నారు. వీరిని అజ్ఞేయవాదులని యనవచ్చును. (Agnostics) ఈశ్వరవాదులలో మరికొందరు పైనుదహరించిన మతములవారితోకూడ భగవంతుడుగలడని యొప్పుకొనుటయేగాక మనుష్యునకు జీవాత్మయనెడు మనోభిన్నమైన పదార్థమొకటికలదనియు, నీజీవాత్మయు, పాంచభౌతికమైన యీబాహ్యప్రపంచము, నీసాగరమందుతరంగములవలె పరమాత్మనుంచి యుద్భవించి దానియందే లీనమగుచున్నవని చెప్పుదురు. వీరిమతమునకును, మనయద్వైతమతమునకును విశేషవ్యత్యాసమున్నట్లు కనపడదు. గనుక వీరినియద్వైతులని యనవచ్చును. (Absolute Idealists) ప్రస్తుతము తెనిగించబడెడుపత్రికను వ్రాసిన యాంగ్లేయవనిత యద్వైతులలో జేరును.

నిరీశ్వరవాదభేదములు:—నిరీశ్వరవాదులలో ననేకభేదములు గలవు. కొందరు భగవంతుడు లేనే లేడనియు, మనుష్యునకు మనస్సుతప్ప జీవాత్మయొకటి వేరులేదనియు నిర్భయముగ వాదించుదురు. వీరిని నిరీశ్వరవాదాగ్రగణ్యులని (Downright Atheists) యనవచ్చును. ఈనిరీశ్వరవాదులలో మరికొందరు భగవంతుడు లేడని నిర్ణయముగ జెప్ప లేక కలడో లేడోయని సంశయించుదురు. వీరిని సంశయాత్ములని (Sceptics) యనవచ్చును. జీవాత్మ లేదనుటచేత వీరందరుకూడ దేహాత్మవాదులే. ఇప్పుడింగ్లాండు దేశములోనుండు నిరీశ్వరవాదులలో (Bradlaugh & Foote) బ్రాడ్లా, ఫూట్, దొరలును కొన్నాళ్ల క్రిందటివరకు నిపతితోకినునాసిన (Besant) బిసాంటు యాంగ్లేయవనితయు, ముఖ్యులు. దుర్జ్ఞేయవాదులలో (Spencer) స్పెన్సరుదొవారు (Bain) బైనుదొరవారునుముఖ్యులు.ఆంగ్లేయదేశములోనుండు మతములలోపయినివివరించబడినవేముఖ్యమయినభేదములు.ఇట్లుండ అనాదిగా మనభరతఖండమందుండు జనులందరు శరీరమనిత్యము, ఆత్మనిత్యము, కర్మవశముచేతనాత్మకుశరీరాంతరములు(జన్మాంతరములు) కలుగుననియు, జన్మమెత్తుటవలన దుఃఖాధిక్యమేగాని సుఖాధిక్యము లేదనియు, మొదలగునంశములను, లెస్సగాదెలిసికొనిరి. కావునపృథ్వీతత్త్వవిచారమునుమాని తత్సంబంధమైనరసవాదము మొదలయిన శాస్త్రములచర్చ విశేషము పెట్టుకొనక, యాత్మతత్త్వవిచారమును మాత్రముచేయుచు తదనుగుణమైనయనేక శాస్త్రములనువ్రాసి ఆత్మయొక్క నిత్యత్వమును శరీరముయొక్కయనిత్యత్వమును భగవంతునితెలుసుకోవలశిన యావశ్యకతను, పలుతెరంగుల ప్రజలకు బోధించుచు వచ్చిరి. గనుకమన భరతఖండీయభాషలలో పృథ్వీతత్త్వమును విచారించెడు (రసవాదము) (Chemistry) శారీరము (Physiology) మొదలగుశాస్త్రములెంతమాత్రమువృద్ధి పొందుటలేదు.

శ్లో॥ "పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే॥"

అనువాక్యము ననుసరించిమృతినొందుట తిరిగి జన్మమెత్తుట

యు, తెలిసికొని, యట్లుదుఃఖమనుభవించకుండుటకు జన్మమెత్తకపో వుటమార్గమనియు, జన్మమెత్తకపోవుటకు, బ్రహ్మజ్ఞానము సంపాదించు టయేమార్గమనియు, ॥శ్రు॥ "నసందృశేతిష్ఠతిరూపమస్యనచక్షుషాపశ్యతికశ్చనైనం హృదామనీషా మనసాభిక్లృప్తోయ ఏ నంవిదుర మృతాస్తే భవంతి." అనుశ్రుతివాక్యముననుసరించి భగవంతుని తెలుసుకొనుట చేతగాని జన్మరాహిత్యము కలదుగనుక, యట్టిభగవంతుని తెలిసికొని శాశ్వతమయినపరమానందమును పొందుటే ప్రధానమైన పనిగా భావించిరి, గాని భగవంతుని తెలిసికొనుటకుమిక్కిలి ప్రయాసమయిన పనిగనుకపృథ్వీతత్వ విచారమందుమనవారు విశేషకాలము వ్రయపరచలేదు. గాని ఇంగ్లాండుమొదలైన తక్కిన దేశములలోని ప్రజలనేకసంవత్సరములక్రిందటనే క్రీస్తుమతము నవలంబించిరి. ఆక్రీస్తుమతసిద్ధాంతప్రకారము స్వర్గప్రాప్తి భక్తివిశ్వాసములు తప్పమరియేమియవసరము లేక పోవుటచేతను, క్రీస్తుమతమును సులభముగ ప్రజలందరు తెలిసికొనుచుండుటచేతను, ఆత్మతత్వ విచారము విశేషయవసరముగ పాశ్చాత్యులకు గనపడుటలేదుగనుక వారికుండుయావత్తుకాలమును బుద్ధినిపుణతను పృథ్వీతత్వవిచారమందే వినియోగపరచి తత్సంబంధమైన రసవాదము శారీరము మొదలగు యనేకశాస్త్రములను విస్తరించివ్రాయుచువచ్చిరి. పరమాణువులయొక్క సంయోగము విభాగము తత్సంయోగజనితగుణములు మొదలగునవి దెలుపు శాస్త్రమురసవాదము (Chemistry) అనబడును. శరీరమందుండు అస్థులుమాంసఖండములు కోశములు నాడులుమొదలగు వానినివివరించి వాని వాని వ్యాపారములనుచెప్పునది శారీరశాస్త్రమనబడును (Physiology) శరీరముకు ప్రధానాంగమైన సిరస్సుయందుండెడు మస్తిష్కమును,(Brain)అచటనుంచిప్రసరించెడుశిరాజాలంబును (Nervous System) వీనినివర్ణించి, శిరాజాలసహితమస్తిష్కముమనస్సునకు ప్రధానాంగమనియు, దానికి నపాయముగలిగిన, మనోవ్యాపారములు నిలిచిపోవుననియు, మస్తిష్కముయొక్క న్యూనాధిక్యముల చేతనే బుద్ధియొక్క మాంద్యసూక్ష్మతలుగలుగుననియు చెప్పెడుశాస్త్రము చిత్తనిరూపణ శాస్త్రము

(Psychology) అని యనబడును. జీవకోటికి ప్రాణాధారమయిన పరమాణువులుకొన్ని శరీరమందున్నవనియు, నాపరమాణువులభివృద్ధిలోకివచ్చునపుడె, మాంసపిండమునకు ప్రాణమువచ్చుననియు, ఆపరమాణువులు శరీరమునుండి వెలుపలికిపోయినప్పుడె మృత్యువు సంభవించుననియు జీవజంతువులయందు ప్రాణాధారక పరమాణువులు తప్ప జీవాత్మయనెడుపదార్థము వేరుగ లేదనియు, చెప్పెడుమరియొక శాస్త్రము గలదు. ఇదే ప్రాణశాస్త్రము (Biology) అనియనబడును. పైనుదహరించిన నాలుగు శాస్త్రములయందును, పాశ్చాత్యులు విశేషపరిశ్రమ చేసిరి. ఈశాస్త్రములలో గొప్పపండితులయిన కొందరు ప్రపంచలీలయంతయుపరమాణుసంయోగవిభాగములచేత నెకలుగుచున్నదనియు, ఆపరమాణువులునిత్యమనియు. ఆపరమాణువులకు కారణభూతుడయిన భగవంతుడొకడుండిన యుండవచ్చుననియు. లేకపోయిన లేకపోవచ్చుననియు. అభిప్రాయబడుచున్నారు. వీరు కేవలముపరమాణువాదులు. మనుష్యులకుగలుగుసుఖదుఃఖములకు తమతెమ జాగ్రతాజాగ్రతలె కారణమనియు, న్యాయపథముతప్పక ప్రవర్తించుచుభగవద్విషయకమయినచర్చ చేయకపోయినను బాధ లేదనియు, ఆచర వలన ప్రయోజనమేమి లేదనియు "లోకేగురుత్వంవిపరీతతాంవాస్వ చేష్టితాన్యేవనరంనయంతి" (Every man is the architect of his own forttune,) అనువాక్యముసత్యమనియు, భాగ్యాభాగ్యములుగాని, సంచితాగామికర్మలుగాని, పూర్వాపరజన్మలుగాని, తుదకుమనోభిన్నమయిన జీవాత్మగాని మనకు లేవని వీరుబోధింతురు. ఆంగ్లేయులలో శాస్త్రపరిశ్రమ విశేషముగ చేసిన వారందరు పయినివర్ణించిన ప్రకారము పరమాణువాదము చేయుచు, మనుష్యుల ప్రవర్తనవిషయమై నీతిమార్గ గమనోపదేశకులయి "అహింసాపరమోధర్మః" అనువాక్యము ననుసరించి సాధ్యమయినన్ని ప్రాణులను సాధ్య మయినంతవరకు సుఖపెట్టునట్టుల ప్రతిమనుష్యుడుప్రవర్తించవలసినదనియు, భగవంతుని దెలిసికొనుట కసాధ్యముగనుక యీసంబంధమయిన చర్చ మానుకొనుటే యుత్తమమయినపనియనియు బోధించుదురు. వీరినియుపకార సౌఖ్యవాదులు

Utilitarians) అనియనవచ్చును. వీరిలోబైన్ (Bain) మిల్ (Mill) అను దొరలుముఖ్యులు. వీరిట్లుండ "లోకె గురుత్వం విపరీతతాం వా" ఇత్యాదివాక్యములు సత్యమేగానిమనుష్యులకు కలుగుసుఖదుఃఖముల న్నిటికినిఐహికకర్మవలన సమాధానముదొరకదనియు, నెంతజాగ్రతగ లవారికయిన, నెంతబుద్ధిమంతులకయిన, నెంతసత్పురుషులకయిన యి హజన్మకృతకర్మతో సంబంధము లేనికష్టములు, ఆపదలు,వ్యాధులు క లుగుచున్నవనియు, అటులనే మిక్కిలిదుర్జనులై సంతతముదుర్మార్గమం దే ప్రవర్తించుచు తమదుష్కృతకర్మమొక్క ఫలమెంతమాత్ర మను భవించక యవిచ్ఛిన్నమయిన జయముకలిగియున్న యనేకదుర్జనులు న్నారనియు, సృష్టివిశ్వవైచిత్ర్యలీలకు ఐహికకర్మవల్లసంతుష్టియయినస మాధానము చెప్పలేముగనుక "సుఖస్య దుఃఖస్య న కో పి దాతా పరో దదాతీ తి కుబుద్ధి రేషా। అహం కరోమీ తి వృధా భిమానః స్వకర్మసూ త్రగ్రథితో హి లోక." అనువాక్యమును. "లోకే గురుత్వం" ఇత్యా దివాక్యముతోచేర్చిన, మనకుకలుగు సుఖదుఃఖములన్నిటికిని పూర్ణమ యిన సమాధానముదొరుకుననియు, గనుక, కర్మసూత్రము, పూర్వజ న్మలు, జీవాత్మ యీమూటిని యొప్పకవల్లలేదనియు, నట్లొప్పిన దేహా త్మవాదనిరాత్మవాదసిద్ధాంతిఃగులవలన తేటబడని యనేకసంశయము లు తేటబడుననియు, కావునభరతఖండీయమతశ్రేష్ఠమగు నద్వైతమత మువంటిదార్ఢ్యమయినట్టియు సంశయోచ్ఛేదియయినట్టియు మతము మరిలేదనిపాశ్చాత్యులలోనయితములక్షలలో నొక్కొక్కరిప్పుడిప్పుడు తెలిసికొని భరతఖండీయమతముల యొక్క మహిమను సాంతముగ గ్ర హించుటకాసక్తిబడుచున్నారు. ఇట్లుత్సాహబడుచున్న పాశ్చాత్యుల లోఆల్ కాట్ (Olcott)దొరవారుహ్యూమ్ (Hume) దొరవారు బ్లా వట్ స్కీ(Blavetsky)బిసాంటు(Besant)యను స్త్రీరత్నంబులునుము ఖ్యులు. వీరినిచూచిపరిహసించెడునిరీశ్వరవాదులలో ఫూట్ (Foote) దొరవారగ్రగణ్యులు. వీరికిని బిసాంటు (Besant) యనునాంగ్లేయవని తకును తమమతసిద్ధాంతముల విషయమైజరిగిన పత్రికావాదము ముందుప్రకరణమందు. సంక్షేపముగవివరింపబడును.

# నిరీశ్వరవాదఖండనము.

## మొదటిప్రకరణము.

---

ఇపుడింగ్లాండు దేశమునందుండు నిరీశ్వరవాదులలో బ్రాడ్లా
(Bradlaugh) దొరవారు, ఫూట్ (Foote) దొరవారు, ఇన్నాళ్లకిం
దటివరకు బిసాంటు (Besant) యను నాంగ్లేయవనితయు, ముఖ్యులని
ముందుప్రకరణమందు వివరింపబడెను.

ఈనిరీశ్వరవాదులందరు శాస్త్రపరిశ్రమ విశేషముగిచేసినవా
రు గనుక వీరికి సహజముగి సర్వజ్ఞత్వము అహంకారము మెండు. వీరంద
రొకరికొకరు సహకారులై క్రీస్తుమతమును ఖండించుటయేగాక రాజనీ
తిమొదలగు ననేకయంశములపైని యుపన్యసించుచుందురు. ఇట్టియు
పన్యాసకులలో బిసాంట్ (Besant) వనితగారు అగ్రగణ్యురాలే, అయి
నను నీమెకునిరీశ్వరవాదసిద్ధాంతమందనేకసంశయములు గిలిగి యా
సంశయములకు నిరీశ్వరవాదులు తగినయుత్తరువులు చెప్పలేమింజేసి
సంశయోచ్ఛేదియగుమతాంతరముకొరకు వెదుకుచుండగా నామె
యదృష్టవశముచే బ్లావెట్స్కి (Blavetsky) యనునామముగలయోగి
నీశిరోమణి యొక్క సహవాసము దొరకియామెవలన సర్వసంశయోచ్ఛే
దియయినయద్వైతమతసిద్ధాంతమును గ్రహించి కృతార్థురాలను ఛి
న్నసంశయురాల నయితినని సంతసించుచుండెను. ఇట్లు సంతోషపడు
చున్న యామెనయిని, ఫూట్ (Foote) దొరవారు మొదలగు తోటిని
రీశ్వరవాదులందరు సక్రోధముగకక్షిగట్టి ఆహా! ఇదియేమియాశ్చర్య
ము బిసాంటువనితగారు సంవత్సరమునకొక్కొక్కమతము నవలంబిం
చుచున్నారు. తొల్లిక్రీస్తుమతములోనుండిరి. తర్వాతమాతో కూడ నిరీశ్వ
రవాదులయిరి. నేడద్వైతమతమందుప్రవేశించిరి. రేపేమతములో
నుందురో తెలియదు. ఇంతవిద్యవచ్చినవారికి నయితేమింత యవ్యవస్థకూ
డునా! ఏమతమునందైనను వ్యవస్థమంచిదిగాని యవ్యవస్థ తగదు. ది
నదినముకొత్తమతములను వెదుకుచుండుట పూర్వమతమును పరిత్య
జించుట బుద్ధిచపలతగాని కుశలతగాదు. బిసాంటు (Besant) వనితగా
రింత యస్థిరురాలని మేమెన్నడనుకొనలేదు. అని యిట్లామెను పలుతె

రంగుల పరిహసించిదూరుచుండుతోటినిరీశ్వరవాదులకామె చెప్పను త్తరంబేమియనిన:----

« ఓనిరీశ్వరవాదిసహోదరులారా! నాపైనిమీరింతయాగ్రహ పడుటకు కారణము లేదు. మీరెంతక్రోధముకనుబర్చినను నేనుతమకబడక శాంతి విడువక యుందును. ఏమియనిన యిట్టిమతచర్చలు వచ్చినపుడు మహాత్ములయినవారు శాంతిశాంతులను విడువక లోకులందరేకమై తమపై కక్షగట్టినను భయపడకతమ శాంతమునువిడువక తంపమతమందుతమకుం డువిశ్వాసమును పోగొట్టుకొనక కాలక్రమమునలోకులనందరినితమశాంతము చేత నే వశ్యము చేసుకుని తమమతముయొక్క-దార్ఢ్యమును లోకులయొక్క- తెలివితక్కు-వను వ్యక్తపరచుదురు. అటులనే మీరునన్నుచూచిపరిహసించిన మాత్రముననామతమందు నాకుండువిశ్వాసముతగ్గదు. మీనింద్యలకుసహించి నాసిద్ధాంతముయొక్క- ద్రఢిమను, మీరునాపైజేయుపూర్వపక్ష పరిహాసములయొక్క- యనాలోచననుమీకుగనబరచెద, సావధానముగవినుండు. ----

« యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలాదపి మనీషిభిః, రవే రవిషయె కిన్న ప్రదీపస్యప్రకాశనం" అనుప్రసిద్ధవాక్యముననుసరించి యుక్తియుక్తముగనుండుమాట లెవరుజెప్పిన విననలయును. పండితులకుగూడతోచనియుక్తులుబాలురకుకొన్నిసమయములందుదోచవచ్చును. సూర్య తేజస్సుప్రసరించని ప్రదేశములయందు తైలదీపమువల్లపనిజరుగుటలేదా? అట్లనేయోనిరీశ్వరవాదిసోదరులారా! మీరుమహాపండితులు. శాస్త్రములెన్నగ చదివితిరి, గానిసర్వజ్ఞులమనిగర్వించుటతప్పు. నేనునిరీశ్వరవాదము విడచుటయవ్యవస్థచేతగాదు. చిత్తచాపల్యమువలనకాదు. నిరీశ్వరవాదసిద్ధాంతమందు పూర్వము సహేతుకముగ గనబడినయనేకయంశములిపుడు నాకుయుక్తియుక్తముగగనబడుచుండలేదు. ఇదిసహజమే. నానాటయనేకగ్రంథములుచదువగాననేకమహాత్ములసహవాసము చేయగాగ్రహించిన యంశములనుమననము చేయగాప్రతిసిద్ధాంతమందునుతోలుతగనబడని యనేకదోష ములు మనకుకాలక్రమమున కనిపించవచ్చును. అట్టిదోషములు కనబడినప్పుడు ఆసిద్ధాంతమును పరిత్య

జించుటకు మనముసంశయించవలసిన పనిలేదు. యుక్తియుక్తము
నుండనిసిద్ధాంతములనుపరిత్యజించుటజ్ఞానాభివృద్ధిలక్షణముగాని [illegible]
తలక్షణముకాదు. అందుకులౌకికశాస్త్రాంతిమములు కూడ యనేకములు
కలవు. బాల్యమందుకొలతచూచికుట్టించుకున్న యంగీలువయస్సుపెరిగి శరీ
రముబలసినకొలదిసరిపోవునా? ఇంతియకాదు! యస్సువచ్చినకొలది శరీ
రమభివృద్ధిపొందుటచేత [illegible] పూర్వాహారపరిమాణములు పో
యిరూపాంతరముకలుగును. [illegible] ముఖ్యసిద్ధాంతము [illegible]
తవిస్తరించును. అట్లువిస్తరించక య[illegible] జాడ్యము
నుసూచించును. ఓ నిరీశ్వరవాదులారా! [illegible] క్రీస్తువు [illegible] డియు
న్నపుడు శాంతమునవహించి సిద్ధాంతపూర్వపక్షములను [illegible] శీలి
చి క్రీస్తువులనం[illegible] పక్షమున [illegible] క్రీస్తువుల
లోమీరుగణియించు తప్పులను [illegible] యుటయు [illegible] గాదు. క్రీస్తు
వులిదురభిమానముకలవారైయు [illegible] యు నిత్యసిద్ధాం
తములనుపరిశీలించకయు, [illegible] ముయు [illegible] నమాటల
నేవేదవాక్యములుగా న[illegible] యు [illegible] చివీరునవ్వు
చున్నారు, గాని క్రీస్తువు[illegible] మీరిదివరకుచదివి
నవేగ్రంథములనియు మీరుచదివినశాస్త్రములనియు మీ [illegible]
యు, మీరుపట్టినకుందేటికి మూడేకాళ్లని వాదించుచున్నారు, నాన
వీనసిద్ధాంతమును, [illegible], దూషించుట, న్యాయమా? ని
రీశ్వరవాదులారా? ఏదైననొకసిద్ధాంతమును నమ్మియుండకపోవుట య
వ్యవస్థాప్రసంగమని మీరనుచున్నారు. [illegible] నవ్యవస్థాప్రసంగము
నకూడదు. దోషయుక్తమని పరిత్యజించినసిద్ధాంతమును కొంతయుక్తి
లులేకయే తిరిగియవలంబించుట [illegible] నను నవ్యవస్థను సూచించు
నుగాని బాగుగపరిశీలించక [illegible] చిన [illegible] తమును కా
లాంతరమందు శాంతము [illegible] చి యంగీకరించు
ట బుద్ధిమంతులలక్షణముగాని యవ్యవస్థను సూచించదు. అట్లనేదాని
మాలోచించకతొందరపడి యంగీకరించిన సిద్ధాంతమును కాలక్రమ
మునయోర్పుతోపరీక్షించి అసద్ధేతువులుకనబడుటచేత దానినిపరిత్య

చుట యవ్యవస్థ కాదు. అట్లుగాక తెలిసియో తెలియకనో, యొకసారి యంగీకరించినమతమును దోషములున్నవని లోకులందరు ఘోషింపుచున్న నామతమును విడిచిపెట్టకుండుట మౌర్ఖ్యము గానిబుద్ధిబల మనిపించుకొనదు. అట్లుప్రతివారును పట్టినపట్టువదలకుండిన లోకమందుజ్ఞానాభివృద్ధి యెట్లుగలుగును? ప్రపంచమందెవరునుసర్వజ్ఞులులేరు. బుద్ధిమంతులయినపండితులందరును తత్త్వాన్వేషణమే ప్రధానమయినపనిగా నెంచుకొనవలయునుగాని యేవిషయములోనుతమయభిప్రాయమే బలమయినదనియు, జయమే ప్రధానమని పట్టుదలగలిగి, యుండకూడదు. అట్టియంశయములోయుక్తి ప్రత్యక్షప్రమాణము శాస్త్రము, ఈమూడే ప్రమాణముగా తీసుకొనెడు స్వచ్ఛందవృత్తిగలనిరీశ్వరవాదులు సర్వజ్ఞత్వమును వహించి యుండగూడదు. గనుక యెప్పటి కేదిప్రమాణముగాను, యుక్తియుక్తముగాను కనబడునో అప్పటికి దానినే నిరీశ్వరవాదులు నమ్ముచుండ వలయును గాని చిరకాలమునుండి సత్యమనినమ్ముచున్న సిద్ధాంతమును సహేతుకముగ ఖండించినను పరిత్యజించకుండుట మీపాండిత్యప్రతిష్ఠకుభంగము సుమండీ; చిరకాలమునుంచిపుట్టి పెరిగినమతమనియు పెద్దలందరీమతములోనే యుండిరనియు ఆమతము నిప్పుడు విడిచిన పెద్దలకు కోపమువచ్చుననియు ఇదేశిష్టాచారమనియు ఇట్టిదురభిమానముగలిగి ఇతరులమాట చేరనీయకుండుట క్రైస్తవులకు చెల్లునుగాని తార్కికులును మహాపండితులునగుతమకు చెల్లునా! మీరందరు క్రీస్తుదేశమందుపుట్టినను క్రీస్తుమతమును నిర్భయముగ ఖండించి నిరీశ్వరవాదమును నిలిపితిరి. ఇతరసిద్ధాంతములనుఖండించుటయందు నిరీశ్వరవాదులకు గలనిర్భయమును స్వేచ్ఛయు నితరులకు లేవు. నిరీశ్వరవాదు లేదైన నొకసిద్ధాంతముతో సంతుష్టిపొందియుండవలెనను నియమము లేదు. అట్టినియమము ఆస్తికులకుగాని మీకుపని లేదు గనుక నిరీశ్వరవాదమందు ప్రవేశించుటచే మీకెంత పాండిత్యము, దార్ఢ్యము, ఉత్సాహము, కలిగినందుకుగాను, నిరీశ్వరవాదసిద్ధాంతమునకు నమస్కరించుచు తత్త్వాన్వేషణకొరకు మతాంతరములనుపరిశీలించుడీ.

గనుక స్వచ్ఛందవృత్తిగల నిరీశ్వరవాదులు నూతనసిద్ధాంతములను పరిశీలించుట కెల్లపుడు సాభిలాషముగనుండవలెను. అటులనుండకపోవుట బుద్ధిజాడ్యమును సూచించును. ఈమాటను గుర్తెరిగి అద్వైతయోగసిద్ధాంతములను పరిశీలించివానియొక్క సారగ్రహణముచేసి వానికిని నిరీశ్వర వాదసిద్ధాంతమునకునుగలభేదమును గ్రహించితిని. అటులగ్రహించినపిమ్మట యద్వైతమతమే యనేకవిధములచేత నిరీశ్వరవాదముకంటె బలమైనదని నాకుతోచినది. మీరుపరిశీలించిన మీకుగూడనట్లేదోచునని నిశ్చయముగ చెప్పఁగలను. ఇతరసిద్ధాంతమునుగూడ పరిశీలించకపోయినయెడల మనమతముయొక్క మంచిచెడ్డ లెప్పుడు తెలియవు. కూపములోనున్న మండూకమునకు కూపమే సముద్రముగా కనబడును. సముద్రములోనున్న చేపకు లోకములోనుండుజలాశయములన్ని సముద్రమంత పెద్దవనే తోచుచుండును. కూపమును సముద్రమును కూడ చూచినవానికే వానినిజమైనరూపపరిమాణములు తెలియును. అటులనేనిరీశ్వరాద్వైతవాదములనురెంటిని పరిశీలించినవానికే యథార్థము తెలియునుగాని ఇతరులకు తెలియదు. నేనురెంటినిచూచితిని. ఏమతముయొక్క దార్ఢ్యమెంతయో నాకు తెలుసును, మీకునిరీశ్వరవాదముయొక్కమంచిచెడ్డలే తెలుసునుగాని.యద్వైతమతము మొదలగువానిసారమును మీరుబాగుగ గ్రహించుటలేదు. వానిని పరిశీలించినపిమ్మటగాని మీకామతములయొక్క సారము దెలియదు.

ఇదియిట్లుండ: కొన్నిదినములక్రిందట జనోపయోగమైనట్టిరాజనీతిమొదలగు కొన్నియంశములపైని యుపన్యాసము చేయుచుంటిని అదిచూచి (Foote) ఫూట్ దొరవారు నేనట్టియుపన్యాసములు చేయుటపొరపాటనియు నిరీశ్వరవాదులు తమసిద్ధాంతమువిషయమయి తప్ప యితరవిషయములపయిని యుపన్యసింపకూడదనియు నాగ్రహపడుచున్నారు. నేనుయోగాద్వైతమతములనుపరిశీలించియామతమునవలంబించినందుకు వారికిగలిగినకోపము వర్ణించనలవిగాదు. నేనునిరీశ్వరవాదినైనంతమాత్రముచేత నిరీశ్వరవాదేతర విషయములను గూర్చి

యుసన్యసించ గూడదాయేమి? పూర్వముకార్లైలు, బ్రాడ్లా (Carlyle Boradlaugh) హెదరింగ్టన్ (Hetherington) వాట్సన్ (Watson) దొరలు నావలె ననేక నిరీశ్వరవాదేతరవిషయములను గూర్చి యుపన్యాసములు చేయలేదా? వారియావనములో ఫూట్ (Foote) దొరవారుస యితము నిరీశ్వరవాదేతరవిషయములపయినియుపన్యాసములు చేయ లేదా? గానివారిటీవల యిట్టియుపన్యాసములు చేయగూడదనినియమ ము చేసికొనిరి కాబోలు. ఆనియమమునకు యితరులు కట్టుబడవలసిన ప నియేమి? అట్టినియమములు క్రైస్తవులకు చెల్లునుగాని నిరీశ్వరవాదు లకుచెల్లవు. కొన్నాళ్లక్రిందట మాసంఘమువారు యోగమతముపయి ని యొక్క యుపన్యాసముచేయుమని నన్ను కోరిరి. అట్టియుపన్యాసము చేయవచ్చునో కూడదో నాకు తెలియదు. ఫూట్ (Foote) దొరవారు మాత్రము నేనట్టియుపన్యాసములుచేయగూడదని చెప్పుదురు. నిరీశ్వర వాదిసంఘమువారియెదుట నిట్టియుపన్యాసములు చేయకూడదు. వారి పత్రికలలో నాసిద్ధాంతములు ప్రచురపరచకూడదు. నిరీశ్వరవాదసిద్ధాం తమందు నాకుకనపడినదోషములను ప్రచురిపరుచుటకు మార్గాంత రము గనపడక నీపత్రికను వ్రాసిచెన్నపురియందుండు యోగసభవారి సహాయముచేనచ్చువేయించితిని.

## రెండవప్రకరణము.

---

నిరీశ్వరవాదమును నేను పరిత్యజించుట కుందు ముఖ్యకారణ ములనిప్పైని వివరించెద. ఫూట్ (Foote) దొరమొదలగు వారివలె నే నేనుగూడ మొదట క్రీస్తుమతత్యాగము చేసి నిరీశ్వరవాదములో ప్ర వేశించితిని. దానిలో పదునైదు సంవత్సరములువెళ్లించితిని. నేనుక్రీస్తు మతమునువిడిచిపెట్టుటకుందు కారణముల నిచట వివరించుటయవసర ము లేదు. నిరీశ్వరవాదసిద్ధాంతముతో లుత నాకుసంతుష్టిగాగనపడెను భగవంతుడు కలడన్నందుకు ప్రత్యక్షప్రమాణము లేదని నిరీశ్వరవాదు లు చెప్పుదురు. అదిసత్యమే. భగవంతుని ప్రత్యక్షముగా జూచినవా

రెవరును లేరు. ఎంత గొప్ప యీశ్వరవాదులు సయితము భగవంతుని చూపించలేరు. ఇంతమట్టుకు నిరీశ్వరవాదులు చెప్పుమాటనొప్పుకోవలెను. గాని కంటికి కనబడనంతమాత్రమున నీశ్వరుని యొక్కగాని, మరియే వస్తువుయొక్కగాని, యభావమును స్థిరపరచవల్ల కాదు. అయిన నీశ్వరుడు కలడన్నందుకు ప్రత్యక్షప్రమాణము లేదు. గనుక కొంతకాలము వరకు ఈశ్వరునియందు విశ్వాసము తప్పి నిరీశ్వరవాదమె సత్యమని నమ్మియుంటిని, ఇట్లుండ కొన్నాళ్లకు ప్రాణము, ఆత్మ, ఈరెంటియొక్క స్వభావమును తెలిసికొనవలెనని యభిలాషగలిగి, యనేక శాస్త్రములు చదువనారంభించి, పదిసంవత్సరములు దొరికినన్ని నిరీశ్వరవాద. దేహాత్మవాదగ్రంథములు చదివి, నా సంశయములు తీరక విసికి; యాశాభంగమునొందితిని. ప్రాణశాస్త్రము (Biology) సాంతముగ చదివి, చిత్తనిర్వచనశాస్త్రము (Psychology) చదువనారంభించితిని. ప్రతిశాస్త్రమందును సూత్రములు వాక్యములు కార్యకారణభావములు మాత్రము కనిపించుచుండును గాని యాత్మ, ప్రాణము, వీనియొక్క నిరూపణయొక్కడను సంతుష్టిగా జేయబడలేదు. దేహాత్మవాదులు వీనికి నిర్వచనచేయలేమని సంక్షేపముగ నొప్పుకొనిరి. తమశాస్త్రము మిక్కిలి మంచిదని గర్వించుచు తమశాస్త్రము సయిత మీరెండిటిని నిర్వచనము చేయలేమని దేహాత్మవాదు లొప్పుకొనుచున్నారు. ఏమియాశ్చర్యమో జూడుడీ! అదిసహజమే. మహాపండితులైన బీల్ (Beel) దొరవారు చెప్పినట్లు ప్రాణమును నిర్వచనము చేయుట సాధ్యముగాదు. దాని నిర్వచనము చేయుటకు ప్రయత్నించిన కొలదిని మిక్కిలి యనిర్వచనీయముగ గనబడును. రసవాదము (Chemistry) గాని, శారీరము (Physiolojy) గాని, నిర్వచనము జేయలేని యనేక వ్యాపారములు సంతతము జీవరాసుల శరీరమందు జరుగుచుండును. ఆ వ్యాపారముయొక్క కర్త పృథ్వీమయమైన వస్తువు కాదు. గనుక పృథ్వీవిషయమైన శాస్త్రము లెన్నడును దానిని తెలుసుకొనలేవు. జడపదార్థములకు చరపదార్థములకు నత్యంతమైన భేదము కలదు. జడమే కాలక్రమమున చరమగు నన్నమాట సత్యము కాదు. జడరూపమైన పృథ్వప్రాణులు నివసించుటకుపయోగిమైన శరీర

రూపములను దాల్చినను, చరపదార్థములకు ప్రధానగుణమైన ప్రాణ
మువూత్రము, పైనుండి యెక్కడనుండియో వచ్చునుగాని, యాజడ
మయమైన పృధ్విలోనుండి పుట్టదు. జడమైన పృధ్విలోనుండి కొన్ని పర
మాణువులసంయోగముచేతనే ప్రాణముపుట్టుననియు, యాపరమా
ణువులు శరీరములోనుండి వెలికిపోవుటచేతనే, మృత్యువు వచ్చుననియు
తిరిగి యాప్రాణాధారకపరమాణువు లెచట సంయోగమగునో అచట
ప్రాణము పుట్టుచుండు ననియు, దేహాత్మవాదులు చెప్పుదురు. ఈప్రా
ణాధారక పరమాణుపుంజమునకుప్రోటోప్లాసమ్. (Protoplasm)అనిపే
రు. కోడిగుడ్డులోనుండు తెల్లనిమాంసపిండమునకే పైనివ్రాసినపేరు చె
ల్లును. ఇట్టి ప్రాణాధారకమాంసపిండము, కేవలము జడపృధ్విలోనుం
చి పుట్టు ననుమాట యసందర్భముగ గనపడును. దేహాత్మవాదులు ప్రా
ణముయొక్క స్వభావ మిదివరకు తమకు రూఢిగా తెలియలేదనియు,
ముందు కాలక్రమమున తెలియవచ్చుననియు, ప్రాణము ప్రాణాధారక
పరమాణుపుంజముయొక్క గుణముకాని వేరు కాదనియు, పరమాణు
సంయోగముచేత, ననేకక్రొత్తగుణములు కలుగుననియు,వాటిలోప్రా
ణ మొక టనియు "నిత్యద్రవ్యవృత్తియో విశేషాస్త్వనంతా ఎవ" అ
నుతర్కశాస్త్రవాక్యము ననుసరించి పృధ్వీగుణము లనేకములు గలవ
నియు,వానిలోప్రాణముగూడ నొకటనియు,నూహించుదురు. శంఖమం
దు వాయువునుపూరించుటచేత నద్భుతమయిన యొకధ్వని పుట్టి యా
వాయువు వెలికి బోయినవెంటనే, యాధ్వని నశించునట్లు, జంతువులశరీ
రమందు ప్రాణాధారకపరమాణుపుంజము ప్రవేశించినతోడనే ప్రాణ
ము పుట్టుననియు, నాపరమాణుపుంజము పయికిబోయినతోడనే ప్రా
ణము నశించుననియు, నుపమానము చెప్పుదురు. గనుక ప్రాణము, పర
మాణుసంయోగజనితగుణము గావచ్చుగాని, ప్రత్యేకపదార్థముగా
దని దేహాత్మవాదుల యభిప్రాయము,గానియీమాట రూఢిగాచెప్పలే
రు. వారిలోకొందరు ప్రాణమును నిర్వచనచేయుట యసాధ్యమనితల
చి యితరులనుగూడ నాజిజ్ఞాసపెట్టుకోగూడదని బోధించుచున్నారు.
గాని ప్రాణనిర్వచనశాస్త్ర (Biology) సహాయముచేత దేహాత్మవా

దులు ప్రాణస్వభావమును తెలిసికోలేకపోయినంతమాత్రమున నితరు లె వరును తెలుసుకోలే రనుమాట కేవలముసాహసము.దీనికి సంతుష్టి య యిన నిర్వచన మద్వైతమతసిద్ధాంతమున దొరకును. అదెట్లనిన:---

శ్లో॥ బీజస్యాంత రివాంకురో జగ దిదం ప్రా జ్నిర్వికల్పం పునః।
మాయావీవ విజృంభయ త్యపి మహాయోగీవ యః స్వేచ్ఛయా।
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతం ॥ తస్మై

సృష్టికి నాదికారణము జడమెంతమాత్రము గాదు.జ్ఞానస్వరూ ప మయినయాత్మయే యాదికారణమనియు, ప్రపంచమంతయు పర బ్రహ్మముచే నిండియున్నదనియు, నద్వైతమతసిద్ధాంతమందు చెప్పబ డియున్నది.

శ్లో॥ యచ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయ తే పి వా।
అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః॥

అనుమహావాక్యము సత్యము.

బీజములోనుంచి వృక్షమువలె పరమాత్మలోనుంచి ప్రపంచ మంతయు పుట్టినది. అనుపైనివ్రాసినశంకరవాక్యము మనకు ప్రమా ణము. ఇట్టిమహాతత్త్వము తెలిసికొన ప్రయత్నించినవారిని యెవర యినా నిందించవచ్చునా?

(Riddles of Psychology.)

చిత్తనిరూపణ శాస్త్రమువలన దేటబడనికొన్నియంశములు దేహాత్మవాదులు ఆత్మయొక్కగాని, మనస్సుయొక్కగాని తత్త్వము ను తెలిసికొని తేటపరచ గలరని సృష్టిరహస్యము తెలసికొనుటకు ప్ర యత్నించిన వారి కెవరికిని తోచదు.

మనస్సుయొక్కస్వభావ మెట్టిదని యడిగిన దేహాత్మవాదులు చెప్పు సమాధాన మేమి యనిన—

మనకుగలుగునాలోచనలన్నియు మనస్సునందు బుట్టును. అట్టి మనస్సుకు ప్రధానాంగము శిరస్సునందుండుమస్తిష్కమును'దానియం దుండు శిరాస్నాయుపుంజంబునని చెప్పుదురు. ఆమస్తిష్కమునకపా యము గలిగినయెడల మనోవ్యాపారము గూడ నిలిచిపోవును.అందు

కు నిదర్శనము కపాలముపయిని గొప్పదెబ్బ తగిలిన మనము స్మృతి దప్పి పడిపోవుదుము. జడచరములకు పరస్పరసంబంధముగల దనుటకును, జడములోనుండి చరముపుట్టుననుటకు, మస్తిష్కమువలన కలుగు మనస్సే, గొప్పనిదర్శనము, గాని చరమంతయు జడములోనుంచి పుట్టినది పుట్టుచున్నదని, వాదమువల్ల కనపరచ గలిగినను జడచరములకుండు పరస్పరసంబంధము ఎట్టిదో దేహాత్మవాదులు స్పష్టముగా చెప్పలేరు. కొన్నినిదర్శనములను మాత్రము కనబరుచుదురు. అందు లోనొకటి, పైత్యకోశములోనుండి పిత్తిమెట్లుబయిటకు ప్రవహించునో యటులనే, మస్తిష్కములోనుండి, యూహాలు, ఆలోచనలు, బయిలవెడలుచుండును అని వాగ్టు(Vogt) దొరవారు నిదర్శనము చెప్పిరి. దానికి బిసాంటు (Besant) దొరవనితగారు చేయుపూర్వపక్ష మేమి యనిన ? పైత్యము పైత్యకోశముగూడ రూపరస గంధవత్త్వాదిలక్షణములు గలిగిన పృథ్వీమయమయినవస్తువులే గనుక వానిలోనొకటి రెండవదానిలో నుండిపుట్టినదనిన, నాశ్చర్యములేదుగాని, శిరస్సునందుండెడుమస్తిష్కము నుండి యాలోచన లెట్లు గలుగునో తేటబరుచుట బహుకష్టము. మస్తిష్కము పృథ్వీమయము. ఆలోచనకు స్థానమయినమనస్సు, ఆకాశస్వరూపము గలిగి చైతన్యముగల యాత్మవంటిది. మనస్సుకు రూపరసగంధవత్త్వాది పృథ్వీలక్షణము లెంత మాత్రము లేవు. ఇట్టిపదార్థము కేవలముజడమయిన మస్తిష్కమునుండి యెట్లు గలిగెనో వివరించలేము.

గనుక వాగ్టు (Vogt) దొరవారు చెప్పినదృష్టాంత మిచట సరిపోదు. ఇదియిట్లుండ—

శారీరశాస్త్ర సహాయముచేత కొన్నిస్వల్పాంశములను వివరింపవచ్చును. అదిచూచినావలె ననేకులు శారీరశాస్త్ర సహాయముచేత సృష్టిరహస్యము, ఆత్మతత్త్వము, మొదలయిన గొప్పయంశములను తేటబరచ వచ్చునని యాశబడిరి గాని తుదకు తమకోరికె నెరవేరక యాశాభంగమునొందిరి. నేనుగూడ ననేకసంవత్సరములు పాలుమాలికలేక నెడదెగని శ్రద్ధతో పయి నుదాహరించబడిన శారీరశా

స్త్రము, ప్రాణశాస్త్రము, మొదలగు శాస్త్రములు చదివితిని,గాని చ
దివినకొలది, దేహాత్మలు భిన్నతత్త్వార్థములనియు, దేహాత్మవాదము
దూరదృష్టిలేనివాదమనియు, దేహము కేవలముపాంచభౌతిక మనియు,
ఆత్మ చైతన్యజ్ఞానస్వరూప మనియు, ఆకాశశరీరము గలదనియు, ఆత్మ
కు కారణము దేహముకాదనియు, దేహములోనుంచి యాత్మపుట్టలే
దనియు, దేహమేయాత్మలోనుంచి పుట్టిన దనియు, "సత్యం జ్ఞాన మనం
తం బ్రహ్మ,తస్మాద్వా ఎతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వా
యుః వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః
ఓషధీభ్యోఽన్నం అన్నా ద్రేతః రేతసః పురుషః, ఆకాశశరీరంబ్రహ్మ- స
త్యాత్మ ప్రాణారామం మన ఆనందం శాంతి సమృద్ధ మమృతం" అనుమ
హావాక్యముల యందాత్మ విషయము చెప్పబడినమాటలే యథార్థమని
యు, ప్రపంచ మంతయు నాత్మవలననే, "బహు స్యాం ప్రజాయై" ఇతి
శ్రుతి వచనము ననుసరించి కలిగిన దనియు,ప్రపంచమంతయు నాత్మయొ
క్క-రూపాంతరమనియు, నానాటదోచుచున్నది. ఇదికాక మనస్సుయొ
క్క- ధర్మములవిషయము కొంచెము విమర్శించెదము, జ్ఞాపకము మొ
దలగు కొన్ని మనోవ్యాపారములను గూర్చి యాలోచించవలయును. ప్ర
తిమనుష్యునకు జ్ఞాపకము, బుద్ధి, కలవు. స్వప్నావస్థయందు దూరమం
దున్న వస్తువులు సయితము కనబడును. మనలోకొందరికి యద్భుతమ
యినబుద్ధి గలదు. అదిగాక కొందరికిభయకారణము దగ్గరలేకపోయిన,
నున్నదనుభ్రాంతిచేతను జ్వరము మృత్యువు మొదలుగునవి గలుగును.
ఇట్టి శరీరవ్యాపారములకు దేహాత్మవాదు లోకరీతిగా సమాధానము
చెప్పుదురు. జీవాత్మగలదను నద్వైతులుమొదలగువారు మరియొక
రీతిని నిర్వచనముచేయుదురు. ఇపుడు తెలిగించబడు పత్రికనాస్తిక్యమ
తఖండనపూర్వకముగ నీశ్వరవాదమును స్థాపించునుగనుక నీశ్వరవా
దులకును నిరీశ్వరవాదులకును వివాదగ్రస్తమయిన యేడెనిమిదియం
శములను తీసికొని వానివిషయమయి నిరీశ్వరదేహాత్మవాదులు చేయు
నిర్వచనమును మొదటవ్రాసి దానిపైనీశ్వర వాదులుచేయుపూర్వపక్ష
మును వ్రాసి సిద్ధాంతము తర్వాతవ్రాయబడును.

౧. జ్ఞాపకము. దేహాత్మవాదులసిద్ధాంతము

మనశిరస్సుయందుండెడు మస్తిష్కములో ననేకమాంసకండలును, రంధ్రములుంగలవు. వానియందు చలనము గలుగునప్పుడెల్ల యాలోచనలు గలుగుచుండును. సంతతము మనమనస్సునం దనేకయాలోచనలు గలుగుచుండునుగనుక నిరంతరము మస్తిష్కమందుండెడిమాంసకండలు కదులుచుండును. నూతనమయిన వస్తువేదైన నొకటి మనదృగ్గోచరమయినపుడు, ఆవస్తువువల్లనుండి వెలుతురుప్రసరించి మననేత్రమందుప్రవేశించి నేత్రములయందుం డెడునరములద్వారా మస్తిష్కమును చేరును. అపు డావస్తువుయొక్కజ్ఞానము మనకు గలుగును. నేత్రములు మూసికొనినను, వెలుతురు లేకపోయినను, నేత్రములయందుండెడు నేత్రేంద్రియ నరముల కపాయమువచ్చినను, మనయెదుటనున్న వస్తువునుకూడ మనముచూడలేము.

వస్తువెదుటనున్నపుడు ఇట్టివ్యాపారములు జరుగునని చెప్పిన నొప్పుకోవచ్చును గాని వస్తుస్వభావమందు వస్తువువిషయమయి జ్ఞాపకముమాత్రమే కలిగినపుడు పైనవివరించిన వ్యాపారము లెట్లు జరుగునో తెలియదుగానివస్తువులేని సమయమందు కూడ అట్టిమార్పులు, మస్తిష్కమందు చలనము కలుగునని దేహాత్మవాదులు చెప్పుదురు. దీనిపయి నీశ్వరవాదులపూర్వపక్షము.

వస్తువు కంటియెదుటనున్నపుడు, అక్కడనుండివెలుతురు కంటికి ప్రసరించి తద్వారా వస్తువుయొక్క స్వరూప స్వభావములను మనస్సుకు గోచరము లగుననిన బాగుండునుగాని యెన్నడోచూచిన వస్తువు ప్రస్తుతము సమక్షమందు లేక పోయినను, దానిజ్ఞానము మనస్సున కెట్లుగలుగును వస్తుసందర్శన జాతవికారములు మస్తిష్కముకును, దానిమూలమగుమనస్సునకు, నెట్లుగలుగును? వస్తువునుంచి వెల్తురు నేత్రేంద్రియముకు ప్రసరించినగాని మస్తిష్కమునందుండు సిరాజాలమందు చలనము గలుగదు. అట్టిచలనము గలిగిన పిమ్మటగాని వస్తుజ్ఞానము మనస్సుకుగలుగదు. కన్నులు మూసికొనినపుడుగాని యంధకారములోగాని వస్తువు దగ్గిరయున్నను మనకు వస్తుజ్ఞానము

లేదు. దీనికి కారణము తేజః ప్రసారాభావమే. వస్తువులేనపుడు తేజస్సు ప్రసరించినను లాభమేమి? గనుక వస్తువుయొక్క ప్రథమదర్శనము లో మస్తిష్కమం దిట్టివికారములు కలిగినవని చెప్పినను మనమొప్పు కోవచ్చునుగాని ప్రస్తుతము దగ్గిరలేనివస్తువును, జ్ఞాపకము చేసికొనిన పుడుకూడ యట్టివికారములు మస్తిష్కమందు కలుగుననియు, గనుక మనస్సుకా వస్తువుయొక్క స్వరూప మనుభవములోనికి వచ్చుననియు చెప్పుట యసందర్భము. ఇదిగాక జ్ఞాపకము విషయము శారీరశాస్త్ర ము చదివినవారు మరికొంతసమాధానము చెప్పుదురు. అదియేమన గా ప్రతివస్తువును చూచినపుడు, ఆవస్తువుయొక్క ప్రతిమ మస్తిష్కమం ను మయినమందు ముద్రవలెనే తగులుకొనుననియు, ఏవస్తువుయొక్క ప్రతిమ దృఢముగాతగులుకొనునో, యావస్తువువిషయమయి దృఢము గా జ్ఞాపక ముండునని పరాకుగా చూచిన వినినవస్తువులయొక్క ప్రతి మలు మస్తిష్కమునకు అంటకపోవుటచేత వానిని శీఘ్రముగా మర తుమనియు శారీరశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

వస్తుసందర్శనజ్ఞానము కలుగుటకు నేత్రేంద్రియమువద్దకు తే జఃప్రసారముముఖ్యము గనుక దూరమందున్న వస్తువులు జ్ఞాపకము లోకివచ్చినప్పు డట్టి తేజఃప్రసారము లేదుగనుక శారీరశాస్త్రజ్ఞులుచె ప్పుమాట జ్ఞాపకవిషయము సరిపడదు. రెండవది. వస్తువుయొక్క ప్ర థమదర్శనములోనే దానిప్రతిమ మస్తిష్కముకు తగులుకొనుననియు ఆప్రతిమ కావలసినపుడెల్లజ్ఞాపముకువచ్చుననియు, చెప్పుటగూడసరిపడ దు. మస్తిష్కమంతగూడగలసి వీశెడు భారమయినసుండదు. జానె డుపొడుగైన లేదు. ఇట్టినియమితపరిమాణములుగల మాంసపిండమం దు, దినదినము లక్షలకొలది వస్తువులప్రతిమలు, ఎట్లుతగులుకొనునో తగులుకొని యెట్లుకలిసిపోకయుండునో, యూహింప శక్యముగాదు. ఒకమయినముమీదగాని లక్కమీదగాని కొట్టిన ముద్రపయిని మరిరెం డుముద్రలను వేసినయెడల, యాముద్రలన్ని కలిసిపోయి యొకటయిన ను స్పష్టముగా కనబడదు. అట్టియంశములో మస్తిష్కమందు ప్రతిది నము వేలకొలది వస్తువులయొక్క ముద్రలుతగులుకొనియెట్లుకలిసిపో

క స్పష్టముగానుండునో దేహాత్మవాదులకే తెలియవలెనుగాని మనకు తెలియదు. ఇది సృష్టిలోనుండు రహస్యములలో నొకటని కొసకు దేహాత్మవాదు లొప్పుకొనుచున్నారు. ఆత్మ లేదని చెప్పి కేవలము శరీరమునే యొప్పి, యిన్ని పాట్లుబడుటకంటే జీవాత్మ యనెడు పదార్థము నొప్పిన యెడల నిట్టియసందర్భవాదము లుండవు. జీవాత్మవాదులయిన యద్వైతులు చెప్పుచున్నారు. వారు జ్ఞాపకము మొదలగుమనో వ్యాపారములనుగురించి చేయునిర్వచన మేమియనిన?

అద్వైతసిద్ధాంతప్రకారము చైతన్యజ్ఞానమును కలిగినజీవాత్మ యొకటి మనుష్యునకు కలదు. ఇంద్రియజనిత మయినసుఖదుఃఖము లీజీవాత్మకే కలుగును. ఒకప్పుడు చూచినవస్తువులను కాలాంతరమందావస్తు వెదుటలేకపోయినను పూర్వము చూచియుండుటచేత జీవాత్మ తిరిగి వానిని జ్ఞప్తికి తెచ్చుకొనును. జీవాత్మ పరమాత్మయొక్క యంశమే (అనగా ప్రతిబింబము) కనుక, దీనికిట్టిమహిమలుకలవని చెప్పిన నాశ్చర్యము లేదు. గనుక చూచిన వస్తువునశించిన, నావస్తువుయొక్క జ్ఞాపకము మాత్రముండకమానదు. జ్ఞాపకశక్తి జీవాత్మయొక్క సహజధర్మములలో నొకటిగాని వస్తుసందర్శనముచేగలిగిన మస్తిష్కగుణము కాదు. జీవాత్మకు, స్థూలశరీరమునువిడిచి స్థలాంతరముకు జని తిరిగి స్థూలశరీరమందు ప్రవేశించు శక్తిగలదు, గనుక దూరమందున్న వస్తువులయొక్క యనుభవముగూడ దీనికికలుగుననుటవలన నాశ్చర్యము లేదు.

బాహ్యేంద్రియవ్యాపారమువలన మనోవికారమును మనోవికారమువలన నింద్రియవికారమును పరస్పరముగలుగును. అందుకుదృష్టాంతముగా, పూర్వమొకప్పు డొకయుద్యోగస్థుడు సమాధిలోనున్న మృతకళేబరము తవ్వించి వెలికిదీయించవలసి వచ్చెను. వాస్తవముచేత సమాధిలో మృతకళేబరము లేదు. సమాధిలోనున్న పెట్టె కేవలము శూన్యముగానే యుండెను, అయిన నట్టిమృతకళేబరములోనుంచి విషవాయువులు ప్రసరించుట యాచారము. అట్టివిషవాయువు లీకళేబరమునుండి కూడవచ్చునేమో యనుభయ మితనికి కలిగి విషవా

యువులు వీల్చుటవలన కలిగెడుమాంద్యమువంటిమూర్ఛవచ్చి క్రిం దపడిపోయెను.

ఇటులనే గ్రంథము వ్రాయుచున్న గ్రంథకర్తయొకడు, పాషాణ ప్రయోగమువలన మరియొకడు చనిపోయెనని వ్రాయుచు, పాషాణముతినిన మనిషివలె తానుగూడ మూర్ఛనొందెను. అతనిశరీరమందు కూడ పాషాణప్రయోగము నలన తరుచుగగలుగుదుర్గుణములు కనబడెను. ఈపయినుదాహరించినరెండంశములలోను వస్తుసందర్శనమెంతమాత్రములేదుగదా, దేహాత్మవాద సిద్ధాంతమువలన నెటుల సమాధానముదొరకును.

వస్తువు ప్రత్యక్షమందు లేక పోయినను జీవాత్మకు వానిస్వభావము లెస్సగదెలుసును గనుకనా వస్తువులుండుచోటికి జీవాత్మ బోయివానిని చూచి వానివలన గలుగుసుఖదుఃఖములను తానును తన నివాసస్థానమున శరీరము ననుభవించుచున్నారు. అనిజీవాత్మ కలదనెడు వారు బోధించుదురు.

౩. కొన్నికొన్ని రోగములయందు రోగులకద్భుతమయిన సామర్థ్యమును గలుగును. అనగా విశేషదూరమందు మాట్లాడబడుచున్న మాటలుసయితము వారికివినబడును. జరుగుచున్న కార్యములుసయితము కనుపించును. శారీరశాస్త్రపరిగానను శరీరబలము తగ్గినకొలది బుద్ధిబలముకూడ తగ్గును. శరీరదార్ఢ్య మెక్కువయినకొలది బుద్ధి బలమెక్కువగును.(A sound mind in a sound body is an old saying.)ఇట్టియంశములో రోగముచేపీడింపబడుచుండెడుశరీరమందు మస్తిష్కమునకూడ బలము తగును. మస్తిష్కబలముతగ్గినపుడు మనోవ్యాపారము, బుద్ధి బలముకూడతగును.అట్లైన పైని వివరించిన యద్భుతశక్తులు మనస్సుకెట్లు కలుగును. జీవాత్మగలదని చెప్పినయెడల నట్టిజీవాత్మ, రోగపూరిత మయినశరీరమందు తనకుసౌఖ్యము లేకపోవుటంజేసి దానిని విడిచిపెట్టదలచి, యక్కడక్కడ పరిభ్రమించుచు

వదలి శరీరాంతరమును వెదకుట యాత్మకు సహజము. "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి, తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని గృహ్ణాతి నవాని దేహీ" అనుగీతావాక్య ప్రకారము రోగముచే శరీరము జీర్ణించినపుడు,జీవాత్మ శరీరాంతరము కొరకు పరిభ్రమించుచుండుటయు, నట్టిప్రయత్నములో పయిని జరిగినకార్యములను తెలిసికొనుటయు, సహజమేగదా! ఇట్లుజీవాత్మ కలదనెడువారు సమాధానము చెప్పుదురు.

౪. దివ్యదృష్టి మొదలగుకొన్నియద్భుతచర్యలవిషయమయి,యీపైని వ్రాయబడును. స్వతస్సిద్ధములగునయవస్థలను తప్పియున్నకొన్ని సమయములలో పూర్వావస్థయందు కనబడని వస్తువులను చూచుట వినబడని మాటలను వినుట సంభవించును. ఈశక్తులకే దివ్యదృష్టి దివ్యశ్రవణము. అని పేరు. ఇట్టిశక్తులను పూర్వము మునిఋషులు కలిగియుండిరట. ఇప్పుడు సయితము కొన్నిసమయములలోను కొన్నియవస్థలలో, నట్టిశక్తులుకొందరికి కలుగును. అట్టివారు తమకండ్లను, గంతలు కట్టబడి యుండినను, వెనుకగా నొకబల్లనుంచినను, బల్లవెనుకనుంచబడినపుస్తకము. చెప్పునవలె నప్పుడె జదువుదురు. ఇట్టిసామర్థ్యముకే దివ్యదృష్టి యందురు. సాధారణముగ నిట్టిదివ్యదృష్టి యోగనిద్రయనెడి యవస్థలో గలుగును. ఇట్టియోగనిద్రను కొందరు నేర్పరులగునయోగశాస్త్రజ్ఞులు, తమయిష్టము వచ్చినవారియందు గలుగ జేయగలరు. ఈయోగనిద్రయందు తనశక్తులు సమనుష్యులకు గలుగును. ఇతరులమనస్సులలోనున్న యభిప్రాయములను గ్రహింతురు. దేశాంతరమునందు కాలాంతరమునందు జరుగునట్టివృత్తాంతములను గూడ చెప్పగలరు. ఇందుకొరకు వృత్తాంతములు చూపబడెను. సంక్షేపవిస్తరభీతిచే వానినిక్కడ నిచ్చుటలేదు. యోగాభ్యాసము చేతగలుగునట్టి యద్భుతవిషయములు హిందూదేశములో గ్రంథములందు వ్రాయబడినవి. ఇట్టిదివ్యదృష్టికి శారీరక, మనస్తత్వవివేచన శాస్త్రములు (Psychology and Physiology) సంతుష్టియయిన సమాధానము చెప్పలేవు. స్థలాంతరమందు కాలాంతరమునందు జరుగుసమాచారము

ను సమ్ముఖమందు జరుగుసమాచారమునువలె చూచుట వినుట శా రీరశాస్త్రప్రకారము కేవల మసాధ్యము. ప్రత్యక్షమందు జరుగుసమా చారము తప్ప దూరమందుజరుగు సమాచారమును తెలుసికొనురీతి ని యాశాస్త్రము వివరించదు. మనస్సు, జీవాత్మ, యీరెంటినిగూ డ నొప్పుకొని స్థూలదేహములోనుండి సూక్ష్మదేహసహితమయిన జీ వాత్మ వెలికి బోవుచుండుననియు, నట్టిశక్తి యోగాభ్యాసముచే ప్రతి నారికిలభించుననియు, నొప్పినయడల దివ్యదృష్టి దివ్యశ్రవణము మొ దలగు మహిమలు విపరీతముగాను, ననిర్వచనీయముగాను కనబడ వు. మనస్సు, జీవాత్మ, యీరెండునుకూడ మనుష్యులకు కలవని యొ ప్పినగాని పైనిజెప్పిన విపరీతచర్యలకు సమాధానము దొరకదు.

౫. యోగనిద్ర.— కొందరుమనుష్యులు తమమనోబలముచేత నె దుటనున్నవారిని వశ్యము చేసికొని తమయిష్టానుసారము తిప్పుకొను దురు. అట్లు వశ్యులయినమనుష్యులుబొత్తిగా స్మారకముదప్పియుందు రు. యోగాభ్యాసముచేతకూడ నెవరిమట్టుకు వారిట్టియోగనిద్రను ర ప్పించుకొనవచ్చును.దీనిని (Hysterical fits)అనేరోగలక్షణమని,శా రీరశాస్త్రజ్ఞులు చెపుదురు. గానిదానికి కారణమును, దానియందు గలుగు దివ్యదృష్టికిని సమాధానము చెప్పలేరు.

యోగాభ్యాసముచేత కూడ నిట్టిశక్తి నారోగ్యావస్థయందే సం పాదింపవచ్చును. దీనినిబట్టిచూడగా మనుష్యుల యందంతర్గతముగ న నేకసామర్థ్యము లున్నట్లు దోచుచున్నది. ఇట్టి యంతర్గతశక్తులను యోగాభ్యాసముచేత నభివృద్ధి చేసుకోవచ్చును.

ఈయోగనిద్ర గలుగచేయుమనుష్యులు తమయెదుట నున్నవా ని తమయిష్టానుసారము తిప్పుకొని వారిని మిక్కిలి వశ్యముచేసికొ వారికి యిష్టమువచ్చినమాటలు అనిపించుదురు. వారిచేత నీళ్లు తా గించి పాలు త్రాగితిమని యనిపించుదురు. ఈయోగమహిమచేతన కొంతమంది యనేకరోగములను గూడబాగుజేసిరి. కొన్నిసమయము లయందిట్లుబాగుచేయుటకు మనుష్యులను స్మృతిదప్పించియుండగా, (Chloroform, క్లోరోఫారము కలుగజేయునిద్రవంటి నిద్రపుట్టించి)

ందరికి యుపాయముగలిగి నందున నీపయిని వైద్యము తెలిసిన వారే
రుట్టియోగవైద్యము చేయవలయునని యేర్పాటుచేయుటకు సీమలో
భయొకటి సమావేశము కాబోవుచున్నది?

(Chloroform) క్లోరోఫారమ్ అనునింగిలీషు మత్తుమందు ఉప
సోగపరుచుటకు ఒకరోగికి తగిన శరీరదార్ఢ్యము లేక పోవుటచేత
Charcot) చార్కాట్ అను నాంగ్లేయవైద్యు డీయోగనిద్రచేత నా
గిని స్మృతితప్పించి రోగికి శస్త్రవైద్యముచేసెను. (Dr.Grillot
్రిల్లట్) దొరవారి యోగనిద్రచేత దుర్మార్గులయిన మనుష్యులను
స్వాధీనపరుచుకొని సన్మార్గమందు నడిపించుచున్నారట.

ఈగ్రంథము ముద్రించుచుండగా యోగవైద్య విషయమయి
Paris) పారిస్సుఅను పురవరమం దొకసభ జరుగుచున్నది. పయిని
రాయబడిన యోగనిద్రలో గనబడు విపరీతచర్యలకు దేహాత్మవాదసి
ంతము శారీరశాస్త్ర సహాయముచేత సమాధానము చెప్పలేదు.

ఏమియనిన :----ఉదకమును త్రాగుచుండగా పాలుత్రాగితి
మనుష్యున కెట్లుతోచును. గోవునుచూచుచు వ్యాఘ్రమును చూచు
న్నానని యెవరైనం జెప్పగలరా? ప్రత్యక్షమందున్న వస్తుసందర్శనము
తనే మనకు సమస్తాలోచనలు సమస్తానుభవములు కలుగునని సిద్ధాం
మిక్కడ పనికి రాదుగాని మనుష్యులకు జీవాత్మయొకటి గలదని
ు, స్థూలదేహమందు మరియొకసూక్ష్మదేహ మున్నదనియు, నొకా
కప్పుడు స్థూలదేహమునుండి సూక్ష్మదేహము పయికి వెళ్లుననియు,
బయిటికి వెళ్లునపు డెంతి దూరమందున్న వస్తువులనయిన చూ
చ్చుననియు నాత్మయున్నదనిచెప్పు నీశ్వరవాదులయొక్క తాత్ప
ము. పయిని వివరింపబడిన యద్భుతచర్యల నీసిద్ధాంతప్రకారము
ంచవచ్చును. యోగనిద్రచేత వశ్యుడయినమనుజునియొక్క
ల దేహములోపలికి నుదకము వెళ్లినను, సూక్ష్మదేహము క్షీరము
చోటికి బోయి, క్షీరములను త్రాగుచున్నది గనుక దానియనుభవ
లెక్కకువచ్చునుగాని స్థూలదేహము యొక్క యనుభవము లె
కు రాదు.

ఏలననిన:— సూక్ష్మదేహముకే చైతన్య జ్ఞానములు కలవు, గాని, పాంచభౌతికమయిన స్థూలదేహమునకు చైతన్య జ్ఞానము లెంత మాత్రము లేవు. కావున మృతశరీరములోనికి పాలుబోసిన నెంతలాభమో సూక్ష్మదేహరహితమయిన స్థూలశరీరములోనికి పోసిన నంతే లాభము. రెంటికిగూడ చైతన్యములేదు. పయినివక్కాణింపబడిన ట్లు స్థూలసూక్ష్మదేహములను వేరుచేయుశక్తి శంకరాచార్యులు మొదలగుమహాత్ములకు కలిగియుండెనని మనము వినుచున్నాము. దీనికే పరకాయ ప్రవేశమనిపేరు.

ఇదిగాక యోగనిద్రచేత నొకరికి వశ్యమయినవారు నిరుత్రాగి పాలుత్రాగితి మని యెదటివారికి భయపడి చెప్పుదురుగాని వారికి క్షీరానుభవ మెంతమాత్రమూ లేదని కొందరు దేహాత్మవాదులు పూర్వపక్షముచేయుదురు. అటులనైన నాయోగనిద్రావస్థయందు జరిగినచరియలను ప్రబోధసమయమప్పుడు మరచిపోవడమేమి? సహజముగా సూక్ష్మదేహమునకు ప్రస్తుతము తను నివసించియున్న స్థూలదేహము ద్వారా కలుగునినుభవములే జ్ఞాపకముండునుగాని, దీనిని విడిచియుండగా కలుగు ననుభవములయొక్క జ్ఞానము తిరిగి స్థూలదేహమందు ప్రవేశించిన తరువాత యుండదనియు, గనుకనే పూర్వజన్మ వృత్తాంత మెంతమాత్రమూ మనకుజ్ఞాపక ముండదనియు, దీనికి కారణము మాయ,యనియు "రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్। సన్మాత్రః కరణోప సంహరణతో యోభూత్ సుషుప్తః పుమాన్।ప్రాగస్వాప్స మితి ప్రబోధ సమయే యః ప్రత్యభిజ్ఞాయతే" అనుశంకరవాక్యము సత్యమనియు, మనవారు చెప్పుచున్నారు. గ్రంథవిస్తరభీతిచేత దీనిస్వభావము నిచట నింతకంటె తేటబరుప నలవిగాదు.

౬. పైనియుదాహరించిన యోగనిద్రతో సంబంధించిన మరికొన్ని యంశములు కలవు. కొందరికి రెండుజన్మ లయొక్క యనుభవము జ్ఞాపకము కలదు. ఒకజన్మ యొక్క వృత్తాంతము జ్ఞాపకమువచ్చినప్పుడు రెండవజన్మ వృత్తాంత మెంతమాత్రము జ్ఞాపక ముండదు. మస్తిష్క

విశిష్టమయిన శిరస్సు ప్రధానాంగముగా గలిగినమనస్సు, తప్ప జీవాత్మ మనుష్యులకు లేకపోయినయెడల, యొక్కటియేమనస్సు, నొకటియే శిరస్సుయున్న విగదా. అట్టిసంగతిలో రెండుజ్ఞానము లెట్లు గలుగును-గనుక నిట్టిచర్యలుకూడ దేహాత్మవాద సిద్ధాంతము వలన తేటపడవు.

౭. (Dreams)స్వప్నానుభవములు కూడ దేహాత్మవాదసిద్ధాంతమును ఖండించి జీవాత్మవాదమును స్థిరపరుచును. శారీరశాస్త్రప్రకారము మస్తిష్కముల్లో కలుగుచలనమువలన నాలోచనలు కలుగునుగాని జాగ్రదవస్థయం దనేకదినములు పట్టుకార్యములు స్వప్నావస్థయం దతిస్వల్పకాలములో జరుగును. జాగ్రదవస్థయందు గంటలో మాటలాడుమాటలు స్వప్నావస్థయందు నిమిషములో మాటలాడుదుము. మాటలాడినపు డెల్లను మస్తిష్కములో చలనము గలుగును గదా. జాగ్రదవస్థయందు గంటలో కలుగు మస్తిష్కసిరాజాల చలనము స్వప్నావస్థయందు నిమిషములో నెట్లుగలుగును. అట్టివేగము వాగింద్రియమునకున్నూ మానసేంద్రియమునకున్నూ జాగ్రదవస్థయందు లేకపోవడ మేమి. జాగ్రదవస్థయందుండు మాంద్యము స్వప్నావస్థయందు పోవడమేమి, దీనికొక సమాధానముకలదు. అదియేమనిన. జీవాత్మ స్వప్నావస్థయందు స్థూలదేహమును విడిచి బయటకు వెళ్లు ననియు, సూక్ష్మదేహసహిత జీవాత్మకు మిక్కిలి వేగము గలదనియు,పృథ్వీమయమయిన శరీరముకంటె, నాకాశమయమైన జీవాత్మకట్టివేగముసహజమనియు. దానికి దిక్కాలనియమములు లేవనియు నంగీకరించిన, స్వప్నవిచిత్రలీల తేటబడును.

౮. జీవాత్మయొకటి మనకు కలదనియు, దానియందు, పూర్వజన్మవృత్తాంత మంతర్గతమైయున్నదనియు, జ్ఞాపకము చేసినపుడది స్మృతికివచ్చుననియు, మనకు గలుగు యనుభవము లన్నిటిని సాధించుట కొక్కమనస్సు చాలదనియు, చెప్పుటకు మరికొన్ని నిదర్శనములు గలవు. అవి యేవనిన కొందరుబాలురు సయితము వారివయస్సుకుతగినబుద్ధికలిగి, గణితశాస్త్ర మందుమిక్కిలి ప్రవీణులైయుందురు. ఎన్నడు వినని మార్గములను కూడగల్పించి చెప్పుదురు. ముదిసినవారు గూ

డ వర్ణించలేని పాఠముల నతిసూక్ష్మ కాలములో నొప్పగించుదురు.ఇది గాక కొందరి కొకశాస్త్రములో బుద్ధి వెళ్లును.మరికొందరికి మరియొకశాస్త్రములో బుద్ధివెళ్లును. విశేషపరిశ్రమ చేయకయే, కొందరికి కొన్ని శాస్త్రములు లభించును. మస్తిష్కముయొక్క న్యూనాధిక్యములచేత నీభేదములు గలుగునని దేహాత్మవాదులతాత్పర్యము. అయితే, బాలురలో మస్తిష్కాధిక్యము లేదుగదా. వారికట్టియద్భుత సామర్థ్యములు యుండుటకు కారణ మేమి? గనుక దీనికి కారణాంతర ముండవలయును. ఇదిగాక, నిద్దరుమనుష్యులయొక్క మస్తిష్కము చూచినయెడల నప్పుడుసమముగానే యుండును. గాని వారిద్దరు వేరువేరు శాస్త్రములయం దభిరుచిగలిగియుందురు. శారీరశాస్త్రసహాయముచేత దేహాత్మవాదు లిట్టివిచిత్రచర్యలను సాధించలేరు.గాని పూర్వజన్మము జీవాత్మ, యీరెంటని స్థిరబరచి పూర్వజన్మమం దేజాత్మ యేశాస్త్రమందుకృషిచేసెనో దానియందేయీజన్మయందు కూడ నభిరుచిగలిగియుండుననియు "బుద్ధిః కర్మానుసారిణీ" సతీవ యోషిత్ప్రకృతి స్సునిశ్చలా పుమాంస మభ్యేతి భవాంతరేష్వపి" అనుప్రసిద్ధవాక్యములవలన పైనియుదాహరించియద్భుతచర్యలనుసాధించవచ్చుననియు, గనుకజీవాత్మకర్మ సూత్రము, పూర్వాపరజన్మములు, ఈమూటిని యొప్పక వల్లలేదనియు, బుద్ధిమంతులయిన యనేకపాశ్చాత్యపండితులునయిత మిప్పుడిప్పు డభిప్రాయపడుచున్నారు. యోగాభ్యాసముచేతను మనుష్యులకనేకమహిమలు లభించు ననుటకు అనేకనిదర్శనములుగలవు.గ్రంథవిస్తరభీతిచే నిచట నవి వ్రాయబడలేదు.

## Theosophical Society.

## యోగసభ.

పయినుదాహరించబడినశంకలన్నిటికిని యోగసభవారు తగినయుత్తరవులొసగగలరు. ఆసభలో చేరుటవలన నన్ను నాతోటి నిరీశ్వరవాదులు మిక్కిలి దూరుచున్నారు గానియది మిక్కిలి యన్యాయము. ఏలనని ననాసభవారియొక్క యుద్దేశములు మిక్కిలి యెన్నదగినవి.

అట్టిసభను చేరుటవలన నాకెంతమాత్రము లాఘవములేదు. ఆసభ వారియుద్దేశము లేవియనిన?

౧. మనుష్యులందరు కూడి సహోదరుల వలనె నైకమత్యముగలిగియుండుట.

"ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్
అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసాం"

౨. భరతఖండమందుండు నార్యులువ్రాసిన కావ్యశాస్త్రములం జదివి వానిసారమును గ్రహించుట.

౩ మనుష్యులయందంతర్గతములై గూఢముగనున్న శక్తులను పరిశీలించికనుగొనుట.

ఇవితప్ప వేరుపనులు సంఘమువారు చేయుటకు తాము నిర్ణయించుకొనలేదు. మహాత్ములవిషయమైకాని, కర్మకాండవిషయమయి కాని, మరియేవిషయమైకాని, చర్చచేయుట పనిగా వారు నిర్ణయించుకోలేదు.

ఈశ్వరవాదులు నిరీశ్వరవాదులు క్రైస్తవులుమొదలగునన్ని మతములవారు సోదరభావముతో నీసంఘమును చేరవచ్చును. ఒకరిపైనొకరాగ్రహబడుటకు కారణమేమియులేదు. ఇట్టిసంఘములో నే నేల చేరితినని నన్నుకొందరు దూరుచున్నారు. వారికుత్తరవు చెప్పుట కష్టముకాదు. ఈపదిలక్షలసంవత్సరములనుండు నాగరికత యెక్కువయి నకొలది, నన్యోన్య ద్వేషము లెక్కువగుటకంటె మరియేమియాధిక్యములేదు. యోగసభవారు నిర్ణయించుకొనిన పనులుమిక్కిలి ఘనమయినవి. మనుష్యజాతి యందరు సోదరభావముతో నుండుట ఘనమయినయుద్దేశముగాని వేరుగాదు.

అట్టిసోదరవాత్సల్యము లోకమందుండుకాలము శీఘ్రము రావలయుననిమనము కోరవలయును. బుద్ధిమంతులయిన వారందరు సంతతముచదువుచు జ్ఞానాభివృద్ధి చేసికొనవలయును. మనుష్యులయందు గూఢమయియున్న సామర్థ్యములను వ్యక్తిబరచుటకు ప్రయత్నించుటగూడయెన్నదగినపని. అట్టియుద్దేశమును నెరవేర్చుటకు నిరీశ్వరవా

దులు మరీ యుత్సాహంబడవలయును. వారికి తత్త్వాన్వేషణమే ప్రధాన మయినపని. ఇంతకంటె యోగసభలో చేరువారు చేయుపను లేమియు ను లేవు. ఆసభను చేరువారు తమకిష్టమయిన మతములో నుండవచ్చును. ఇష్టమయినయెడల సభవారితోకలిసి యోగచర్య చేయవచ్చును లేదా మానవచ్చును. నిరీశ్వరవాదా గ్రేసరుడైన బ్రాడ్లాదొరవారు స యుత మీసభను చేరవచ్చును. ఈపత్రికయచ్చుబడు చుండగా నమెరికా నుంచివచ్చిన కొన్నిపత్రికలు కలవు. సెంటులూయీ అనునొక యమెరికా పట్టణములోస్థాపింపబడిన యొకయోగసభను (Branch Theosophical Society) ఆదిసభతో (Parent Society) చేర్చుటకొకదరఖాస్తు పంపబడెను. ఆరెండుసభలవారికి జరిగినప్రసంగములోకూడనీయోగసభయొక్కయుద్దేశము లెన్నదగినవనియు మనుష్యులయందు గూఢమైయున్న శక్తులనుకనిపెట్టుటయొక్కయుద్దేశముగాని మరియొకటి గాదనియు నా సభవారుద్దేశబడిరి. యోగసభలోచేరినంతమాత్రమున నాసభవారు చెప్పుమాటలను నమ్మి సంతుష్టింబొంది యుండవలయు నను నియమము లేదు. మనుష్యులు యోగాభ్యాసము చేతను మహిమలను సంపాదించుట సాధ్యమా యసాధ్యమా యని పరిశీలించుటయే ముఖ్యమయినపని. నాయభిప్రాయము గూడనదియె. ఆయోగాభ్యాసమువలన నెట్టిమహిమలుసంభవించునో చూడవలయునని, యీసభను చేరితినిగాని, యట్టిమహిమలు గలవనునమ్మకము చేతనీసభను చేరలేదు. అయినను పూర్వజన్మముగలదనియు, నాత్మ శరీరాంతరములను ప్రవేశించుననియు, నేను నమ్ముచున్నానని పూట్ (Foote) దొరవారు నన్న న్యాయముగ నిందించుచున్నారు. ఇట్టిలేనిపోనిమాటలు నాకపకీర్తి దెచ్చుట కనుచున్నారు గాని న్యాయ మెంతమాత్రమూ చూచుటలేదు. ఈసభవారి యుద్దేశములు నెరవేరినను నెరవేరకపోయిన నుద్దేశములు మాత్రము మిక్కిలి ఘనమయినవి. మనుష్యులయందు గూఢమై యంతర్గతముగా శక్తులున్నవనియు, తపస్సుచేతను, యోగశాస్త్రమునను సరించి వాయునిరోధము చేయుటచేతను, అణిమా, మహిమా, ఖేచరత్వము, మొదలగు శక్తులు మనుష్యునకు గలుగుననియు, మనయోగశాస్త్రమందు చెప్ప

బడియున్నది. అట్టిసామర్థ్యములు మనకులభించుట సాధ్యమా, య
సాధ్యమా యని యోగసభవారు పరీక్షించ దలచుకున్నారు. ఇట్టిశ
క్తులు మనుష్యులకు కల వనియు, కలుగజేసుకోవచ్చుననియు, నమె
రికాఖండమునందుండు కొందరుగొప్పవిద్వాంసు లొప్పికొనుచున్నారు.
(Wayland Brown)దొరవారు(Hamilton)హామిల్టన్ దొరవారుకూ
డ నొకానొకప్పుడు మనుష్యుల కింద్రియసహాయము లేకయే జ్ఞానా
నుభవములు గలుగుననియు, ప్రత్యక్షమందు లేనివస్తువులయొక్క యను
భవముగూడ గలుగుననియు చెప్పుచున్నారు.

హామిల్టన్ (Hamilton) దొరవారు, (Brown) బ్రౌన్ దొర
వారుకూడ, నాంగ్లేయపండితులలో మిక్కిలిగొప్పవారు గాని కొద్దివా
రుకారు. ఇట్టివారుసహితము ఇట్టియభిప్రాయబడుచున్నపుడు మనుజు
నియంతరతశక్తు లున్నవా లేనా యని పరీక్షించుసభలో, నేనుచేరి
నందువలన తప్పుగనబడదు. ప్రాచీనమతము బోయి నవీనమతము
స్థాపించబడు నపు డెల్ల ప్రాచీనమతస్థులు ఘోషించక నూరు. కాని
తత్త్వాన్వేషణము, నవీనమతప్రాప్తి, యీరెండే ప్రధానముగా భా
వించెడు నిరీశ్వరవాదులట్లు ఘోషపెట్టగూడదు.





## యోగము.

### THEOSOPHY (దైవజ్ఞానము.)

(Theosophy) అనునింగిలీషుమాటకు దైవజ్ఞానమని యర్థము. గనుక నీసభవారికి పరమాత్మజ్ఞానప్రాప్తి ప్రధానమైన పని; ఈసభలోచేరినవారు బుద్ధిమంతులయినయెడల సభవా రుపదేశించుమార్గమున వెళ్లి బ్రహ్మజ్ఞానమును సంపాదింపగలరు. అయితే కొందరీసభలోజేరినయుత్తరక్షణమందే, తమకు యోగులకుగలుగు గొప్పమహిమలు లభించవలయుననియు, నట్టిమహిమలుగలమహాత్ములు తమకుగనపడవలయుననియు, పిచ్చికోరికలుకోరి, యాశాభంగమునొంది, సభయందగౌరవబుద్ధిగల వారగుచున్నారు. ఇది బుద్ధిహీనత. అక్షరస్వీకారమయినతోడనే, పుస్తకమెవరయిన చదవగలరా? యోగసభలోచేరినమాత్రమున యోగమహిమ లెటులలభించును. గనుక కొంతకాలమువరకు నోర్పుగలిగి యోగాభ్యాసముచేయుచు, మహాత్ములసహవాసము చేయవలయును. యోగసభవారు బోధించు ప్రధానాంశము లేవి యనిన —

౧. మనశాస్త్రమందు మనుష్యులకు ఖేచరత్వము, దివ్యదృష్టి మొదలగుయద్భుత మహిమలు యోగాభ్యాసము చేతలభించునని చెప్పబడియున్నది. ప్రస్తుతమున్నశక్తులు తప్ప వేరుశక్తులు మనుష్యులకు లేవనియు, ఖేచరత్వము మొదలగుశక్తుల మానుషములుగాని మానుషములుగావనియు పాశ్చాత్యపండితులు వాదించుచున్నారు. గానియోగసభవారితాత్పర్యమేమియనిన? అట్టిశక్తులు తపస్సుచేతను, యోగాభ్యాసముచేతను, మనుష్యునకు లభించుననియు, తపస్సుచేతను, పూర్వఋషులు కొందరికి మర్త్యత్వము బోయిదేవత్వము వచ్చినదనియు

౧. "తపసా దేవా దేవతా మగ్ర ఆయన్"
౨. "తపసా ఋషయస్సువ రాన్వవిందన్"
౩. "తపసా సపత్నాన్ ప్రణుదా మరాతీన్"
౪. "తపసి సర్వం ప్రతిష్ఠితం"
౫. "తస్మాత్తపః పరమం వదంతి"

అను శ్రుతి వచనములే దీనికి ప్రమాణ మనియు, ప్రయత్నము చేసిన యెడల నిప్పుడైనను మన మష్టమహిమలను సంపాదించవచ్చునని యు, యోగసభవారు బోధించుదురు.

౨. యోగసభవారు బోధించు రెండవయంశ మేమియనిన, భగ వంతునకు క్రైస్తవులు చెప్పునటుల, కరచరణాద్యవయవములు లేవ సి చెప్పుదురు, గనుక భగవంతుడు కేవలము లేనే లేడనే నిరీశ్వరవాదు లు-బౌద్ధులు, సులభముగా నీయోగసభలో చేరవచ్చునని (Madam Blavetsky, పేరుగల) దొరకాంతగారు చెప్పుచున్నారు.

౩. భగవంతుని విషయమై యోగసభవారి తాత్పర్య మేమనిన:-

"సర్వం ఖల్విదం బ్రహ్మ" ౧

శ్లో॥ "సర్వభూతస్థ మాత్మానం, సర్వభూతాని చాత్మని" ౨

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ౩

"ఆకాశశరీరం బ్రహ్మ" ౪

"సత్యాత్మప్రాణారామం మన ఆనందం" ౫

"శాంతిసమృద్ధమమృతం" ౬

ఇత్యాది వాక్యములయందు చెప్పబడినట్లే, సర్వవ్యాపకుడై జ గత్పరిపూర్ణుడై, బ్రహ్మస్వరూపుడైన యొకదేవుడే కలడని యో గసభవారు బోధించుచున్నారు.

౧ "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"

౨ "అనంత మవ్యయం, సముద్రేన్తం,ఋతం,సత్యం పరం బ్రహ్మ" ఇదే వారిమతము. అపర బ్రహ్మములోనుంచే, జీవాత్మయు, పృథ్వి యుం బుట్టినవి. ప్రపంచమున కాదికారణములు పరమాణువులు గా వనియు, ఆత్మలోనుంచి పృథ్వి పుట్టినదనియు, పృథ్విలోనుండి యాత్మ పుట్టలేదనియు, ప్రపంచమున కాదికారణము జడము కాదనియు, చ రములోనుంచే జడము పుట్టినదనియు, బోధించుచున్నారు.

౧ "బహుస్యాం ప్రజాయేయ" అనుశ్రుతివచనమువలనకూడ పరబ్ర హ్మయొక్క, ఇచ్ఛా మాత్రమున ప్రపంచ ముత్పత్తియయినట్లు కనబడు

చున్నది. పైని వ్రాయబడిన ప్రశ్నలకును ఈప్రకరణారంభమందు వ్రాయబడిన శారీరశాస్త్రపూర్వపక్షములకును, దేహాత్మవాదులుతగిన యుత్తర వొసగలేరు. గనుక —

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ"

అను శ్రుతివాక్యమే సత్యము.

పయినుదాహరించిన దివ్యదృష్టి, దివ్యశ్రవణము, ఖేచరత్వము, మొదలగు నద్భుతచర్యలకు, నేశాస్త్రమువలన సమాధానము దొరకునో యాశాస్త్రమునే మన నువలంబించవలయును. దేహాత్మవాదమువలన పృథ్వీమయమయినశరీరధర్మములకు సమాధానము దొరుకును. ఆత్మయొక్క యద్భుతచర్యలకన్నిటికిని శారీరశాస్త్రమువలన సమాధానము దొరకదు. దొరకకపోవుటయేకాక యట్టిమహిమలు మన కలభ్యములు, అనిర్వచనీయములు, అని యాశాస్త్రము విడిచి పెట్టినది. గాని యాత్మనేప్రపంచమున కాదికారణమునుగా నొప్పినయడల, మనయాత్మవ్యాపారము లన్నిటికిని, సంతుష్టియయిన సమాధానము దొరకును. దేహాత్మవాదులు తాము నిర్వచనచేయలేమని యొప్పికొనిన యంశములకు నితరశాస్త్రములవలన సమాధానమును కనిపెట్టుట తప్పితమా ?

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అను సిద్ధాంతమును అంగీకరించుచు, మనుష్యులకు జీవాత్మగలదని యొప్పికొనిననీయెడల, యద్భుతచర్యలు విపరీతముగా కనపడవు. స్పినోజా(Spinoza) బ్రూన్(Brune) మొదలగుగొప్ప దొరలుగూడ నీసిద్ధాంతమునే యంగీకరించిరి. గనుక దీనినే విశేషబలమయిన సిద్ధాంతముగా నమ్మవచ్చును. మనకు కనబడు ప్రపంచము మిథ్య' అమిథ్య' అనువిచారములో. శాస్త్రజ్ఞులయిన పండితులొకరీతిని, మతగురువులొకరీతిని, చెప్పుచున్నారు. తాము చెప్పినదే వేదవాక్యమనియు, వానిని ఖండించకూడదనియు, మతగురువులుచెప్పుదురు. ప్రపంచసృష్టియొక్క రహస్య మనిర్వచనీయ మనియు, నదితెలుసుకొనుటకు తగినజ్ఞాన మిప్పుడు లేదనియు, గనుకతమ మాటలను నమ్మి వాటినిజమును, కాలక్రమమున పరిశీలించవచ్చునని

యము, యీయోగశాస్త్రచర్చ జేసినపండితులు తమశిష్యులతో చె
ప్పుదురు. క్రీస్తుమతగురువులకు నీశాస్త్రపండితులకును, గలభేద మే
మియనిన:—

క్రీస్తుమతగురువులు తాముచెప్పుమాటలను తమశిష్యులను
పూర్వపక్షము చెయ్యనివ్వరు. ఈశాస్త్రపండితులైనమహాత్ములు తా
ము చెప్పిన మాటలను తమశిష్యులు ఖండించినను, వారికి కోపము లేదు.
యోగసంఘములో చేరువా రాసంఘము వారియభిప్రాయములతో
నేకీభవించనక్కర లేదు. ఎవరిమట్టుకువారు పరిశీలించి తమకుయుక్త
మని తోచినయెడల నాసంఘము వారియభిప్రాయములతో నేకీభవిం
పవచ్చును, లేనియెడల నాసంఘములో ముఖ్యులైనగురువులు చెప్పిన
మాటలు విశ్వసించి వారిమతమునవలంబించినయెడల శ్రీఘ్రకాలము
లోనే బ్రహ్మతత్త్వమును తెలుసుకొందురు. గురువుచెప్పినమాటల
యందు విశ్వాసములేక తమస్వబుద్ధిచేతనే బ్రహ్మతత్త్వమును తెలుసు
కోవలెనని ప్రయత్నము చేశినయెడల తెలుసుకొనుట కభ్యంతరము లే
దుగాని కొంచము విలంబమగును. (Thesophical Society) యోగ
సంఘములో చేరినమతగురువులవిషయమయి కొంచెము వివరించి
చెప్పెదను. ఈగురువులు మహాత్ములు. వివిధజాతులవా రయ్యును సో
దరభావమును వహించి యీసంఘముతో చేరి సామాన్య జనులయం
దు లేని కొన్నిమహిమలను సంపాదించిరి. (Huxley) హక్స్లీ మొద
లగు శారీరశాస్త్రపండితమహిమ లాశాస్త్రములో నెంతప్రమాణ
ములో నీయోగశాస్త్రవిషయమయినచర్చలలో నీమహాత్ములయొ
క్కమాట లంతప్రమాణము. ఈమహాత్ములు తాము గొప్పమహిమల
ను సంపాదించుటయేగాక తమయుపదేశమునుపొంది తాముచెప్పినప్ర
కారము నడిచిన స్త్రీపురుషులకు కూడ నామహిమలు లభించునటుల
చేతురు.

వారిశిక్షలో నుండి వా రుపదేశించినమార్గముల నడిచినవారం
దరుగూడ నట్టిమహిమలను సంపాదించవచ్చునట. ఈయోగసభ జే
యుమతబోధలను మన మంగీకరించక పూర్వము; ఈసభకు ప్రధా

నులైనమహాత్ము లెక్కడ నున్నారా? లేరా? వారికి నమానుషశక్తులు న్నవా? లేవా? వారికి మతబోధచేయు యోగ్యత గలదాలేదా? యీప్రశ్నములను మనము విచారించవలయును. మహాత్ములయంద ద్భుతమయిన యమానుషమహిమలున్న యడల వారుచేయు మతబోధనలుగూడ సహేతుకములుగాను, యుక్తియుక్తములుగా, నున్నట్టు మన మంగీకరించవచ్చును. కనుక నిట్టిమహాత్ము లున్నారా?అనుప్రశ్న కనేక విధములుగా నుత్తరవు వ్రాసిరి. హిందువులతో పరిచయ ముగలవా రందరు అట్టిమహాత్ము లున్నా రనేనమ్ముదురు. ఈమతమందభి మానముగల వారందరు మహాత్ములను చూచితి మని చెప్పినవారితో కలుసుకుని, వారు చెప్పుమాటలను ఖండించి పరిశీలించుదురు. గాని, నావంటి యబలకు ప్రత్యక్షముగ నట్టిమహాత్ములను కలుసుకొనుట య సాధ్యముగనుక, నొకానొకప్పుడు, సంశయింప వలసివచ్చును. గాని, మన క్రీప్రపంచములో తరుచుగ కను బడినట్టియు,సామాన్యజనులు చే యనట్టి కొన్నియద్భుత చర్యలు చూడగా, పూర్వముదాహరించిన యద్భుతచర్యలు మసాధ్యములని తోచును.జనులను మోసముచేయు నుద్దేశముతో నీసిద్ధాంతము పుట్టినయడల అది విశేషకాలము నిల లేదు. అమాయకురాలగు (Madam Blavetsky) బ్లావెట్స్కీవ గారట్టిమోసము చేయుచుండిరనుట. నమ్మతగిన మాటకాదు. దర్శ న మిప్పించుమని భక్తిశ్రద్ధలతో వేడికొనినవారికి మాత్ర మీమహాత్ము లు దర్శన మిచ్చుదురుగాని సర్వజ్ఞులమని గర్వపడుపండితమ్మన్యులకు వారిదర్శనము లభించదు. వారి నితరులు తెలిసికొనకపోవుటచేత వా రికి కొరతలేదు. క్షుద్రదేవతబలలె తమరినాదరించి గౌరవించనివారిని వారు బాధించరు. ఈయేకోనవింశచ్ఛతాబ్దపండితమ్మన్యుల కిదియెం తయు విపరీతముగా కనబడినను అట్టిమహాత్ములు లేరని లోకులందరు ఘోషించినను వారికికించ లేదు. కొంతకాలము క్రిందట మనవలె వా రును సామాన్యజనులై యుండి, కాలక్రమమున యోగాభ్యాసముచే తమయంతర్గతమైనశక్తులను, వృద్ధిపొందించుకొని గొప్పమహిమలను సంపాదించిరి. గనుకవారు కనపర్చుమహిమ లెంతమాత్ర మమాను

షములు కావు. ప్రయత్నించి యోగాభ్యాసముచేసినయెడల మనకు కూడ నట్టిసామర్థ్యములు లభించును. అట్టిమహాత్ములయొక్క యుపదేశములచే మనకు సమస్తసంశయములు నివారణయగుననియు, వారుచేయుబోధలవలన మనకు మోక్షమార్గముకూడ దొరకుననియు, యోగసభవారు చెప్పుదురు. (Theosophy) ఈ యోగసిద్ధాంతప్రకారము మనుజునిశరీరము పాత్రవంటిదనియు, పాత్రయం దుండుదీపమువలె మనశరీరమందు బ్రహ్మముయొక్క యంశమయిన జీవాత్మయొకటి గలదనియు, చెప్పబడుచున్నది. ఆత్మ, బుద్ధి, మనస్సు, అనుమూర్తిత్రయము శరీరమం దున్నది. ఆమూర్తిత్రయముగాక మరినాలుగు ముఖ్యవస్తువులు గలవు. కామరూపము, ప్రాణము, లింగ శరీరము, రూపము, అను మరి నాలుగువస్తువులు కలవు. మొదట చెప్పబడినమూర్తిత్రయము యీజన్మలోగూడ తక్కిన చతుష్టయమునుండి వేరుచేయవచ్చుననియు, స్థూలదేహమునుంచి లింగశరీరమును వేరు చేయవచ్చుననియు, యోగశాస్త్రము బోధించుచున్నది.

అట్టిసంగతి యసాధ్యమని దూరదృష్టిలేని సామాన్యజనులు హేళన చేయవచ్చును. గాని యోర్పుగలిగి శ్రద్ధతో పరిశీలించినవారికీసంగతి, యసాధ్యము కాదని మనము కనబరచవచ్చును. గాని ప్రథమములో నవీనసిద్ధాంతములను చూచి చూచి సామాన్యజనులు పరిహాసించక మానరు. ఈస్థూలసూక్ష్మదేహములు వేరుచేయవచ్చునని యొప్పుకొనినయడల పైని యుదాహరించిన దివ్యదృష్టిమొదలగు మహిమలకు, తగిన సమాధానము దొరకును. ఇట్టియవస్థలో జీవాత్మశరీరమునుంచి బయిటకు బోయి శరీరములో నున్నపుడువలెనే యన్నిపనులు చేయును. శరీరమును విడిచియున్నప్పుడు దేశకాలనియమములేక సర్వకాలములయందు జరుగు సమాచారమును గ్రహించును. ఈదివ్యదృష్టి సాధారణముగ యోగనిద్రలో కలుగునట్లు కొందరు చేయగలరు.

ఇట్టినేర్పుగలకొందరుమహాత్ములు తమయెదుట నున్నవారికి యోగనిద్ర గలుగజేసి స్మృతి దప్పించి, యాస్మృతిదప్పిన మనుజుని

యొక్క జీవాత్మసహిత సూక్ష్మదేహమును, స్థలాంతరమునకు పంపించి యక్కడి సమాచారమును తెలిసికొనియెదరు. నియమితపరిమాణముగల స్థూలదేహమందు సూక్ష్మదేహము నివసించియుండు నంతవరకు మనుజుని యింద్రియ వ్యాపారములుగూడ దిక్కాలనియమము గలిగి యుండును. కొంతదూరము వరకే నేత్రేంద్రియము ప్రసరించును. కొంతదూరమందు చెప్పబడినమాటలే వినబడును. అటుపయిని జరుగు సంగతులు కనబడవు, వినబడవు. నిర్ణీతపరిమాణము గల స్థూలదేహమును, సూక్ష్మదేహమును విడిచియున్నయవస్థలో, దిక్కాలనియమములు లేక ఎంతదూరమందున్న సమాచారమునయిన గ్రహించును. ఒక గ్రామమందుండి మరియొక గ్రామమందు జరుగుచున్న సమాచారమునుకూడ తెలుసుకోగలదు. అట్లుసామాన్యజనులు తెలిసికొనలేరు. స్థూలసూక్ష్మదేహములు కలసియున్నపుడు పయిని యుదాహరించినమునులు సయితము తెలిసికొనలేరు. ఈయోగనిద్రావస్థలో స్థూలసూక్ష్మదేహములు వేరై యుండునపుడు జరుగు సమాచారముయొక్క స్మృతి జాగ్రదవస్థలో నెంతమాత్ర ముండదు. గాని యాయోగ నిద్రలో దివ్యదృష్టిచేత జూచినవస్తువుయొక్కయనుభవమింద్రియముల ద్వారా మస్తిష్కమునకును,త ద్వారా మనస్సునకును,కలిగినయెడల నాయోగ నిద్రానంతరమున వాని జ్ఞాపక ముండకమానదు. సూక్ష్మదేహముకు మాత్రమే ఇట్టియనుభవము గలిగి యుండుటచేతను, స్థూలదేహమున కెంతమాత్ర మా వస్తువులయొక్క యనుభవము కలుగక పోవుటచేతను, సూక్ష్మదేహము వచ్చి స్థూలదేహమందు తిరిగి ప్రవేశించినపిమ్మట, యోగ నిద్రావస్థయందు జరిగినయంశములయొక్క స్మృతి యెంతమాత్ర ముండదు.

అట్లుగాక మస్తిష్కము కాయవస్థయొక్క యనుభవ మేమయిన గలిగినయెడల నది జ్ఞాపకముండక మానునా? శరీరమునువిడిచి, దానిసహాయము లేకయే సూక్ష్మదేహము యోగనిద్రావస్థయందు, స్థానాంతరమునందున్న వస్తువులను చూచివచ్చును. స్థూలసూక్ష్మదేహములను వేరుచేయుట యసాధ్యమయినయెడల స్థానాంతరవస్తుసంద

ర్శన మేయవస్థయందుగూడ లేక పోవలసివచ్చునుగదా? గాని యోగ నిద్రావస్థయందును మరికొన్ని యవస్థలయందును స్థానాంతరస్థితవస్తు సందర్శనము కొందరికిగలదనియు, కలుగుననియు, మన కనేకనిదర్శ నములు గలవు. గనుక స్థూలసూక్ష్మదేహములను వేరుచేయుట సాధ్య మని మన మొప్పుకొనకదప్పదు. ఇట్లు వేరుచేయడము సాధారణముగనె ల్లపుడు, యోగనిద్రయందు మాత్రము జరుగుచున్నది. ప్రయత్నము చే సి యోగాభ్యాసము చేసినయడల జాగ్రదవస్థయందు కూడ, సూక్ష్మ దేహములను వేరుచేసి స్థానాంతరమందున్న వస్తువులను, భవిష్యత్తు లో జరగబోవు కార్యములను చెప్పవచ్చును. దీనికే దివ్యదృష్టి యని పేరు. ఇది పూర్వము మనఋషులలో కొందరికి గలిగియుండె నని చె ప్పుదురు. రోగముచేత శరీరము నీరసించినపుడు కూడ నిట్టిదివ్యదృ ష్టి గలుగునని కొందరు చెప్పుదురు.

ఇది యెట్లుగలుగునో యిదివరకు పయిని వ్రాయబడినది. ఆ రోగ్యదశలో నిట్టిమహిమలు సంపాదించుటకు, చిత్తశుద్ధి గలిగి, మ నస్సు పరిపాకమును బొందుట ముఖ్యము. జీవాత్మలేనియడల, కర్మ, పునర్జన్మము, ఈరెండిటితో పనిలేదు. పూర్వజన్మలయందు చేసిన కర్మసంచయములతో క్రొత్తకళేబరములయందు జీవాత్మ ప్రవేశిం చును. పూర్వము ప్రారంభించబడినకర్మలనే యీజన్మలయందు కూడ చేయుచుండును. పూర్వజన్మలయం దేవిద్యయందు పరిశ్రమచే యుబడెనో యావిద్యయందే యీజన్మయందు కూడ బుద్ధి ప్రవేశించు చుండును. పూర్వజన్మమందు కృషి చేయబడినవిద్య యీజన్మమందు ్రశేష శ్రమలేక లభించును. దీనినే బుద్ధివిశేషమని యందురు. మి క్కిలి పసిబాలురుసయితము గణితశాస్త్రమందు కొందరు విశేషప్ర ్ణత గలవారై యున్నారు. ఒకానొకచోట వారివయస్సునకు తగని ప్రావీణ్యముగలదు.

ఇది పూర్వజన్మకృత కర్మఫలమని పయిని వివరించియుంటి ్. ఇట్టి ప్రావీణ్యము గలిగియుండుటకుం గారణము శారీరశాస్త్ర

మువలనం దేటబడదు. ఇట్టి యద్భుతచర్యలకు జన్మాంతర కృతకర్మ వలననే సమాధానము దొరకును.

సిద్ధి బొందినకొందరు మహాత్ములు తమకు పూర్వజన్మజ్ఞానము గలదని రూఢిగా నమ్మించి చెప్పుచున్నారు. కర్మకాండ విషయమై వీరుజెప్పునదియేమి యనిన:— ఒకజన్మమందు జేసినకర్మ ఆజన్మతో నశించక పరజన్మమునకు సంచితమయి, తనకర్తయొక్కబుద్ధిని తనకు సాదృశ్యమయిన కర్మనే చేయుమని ప్రేరేపించుచు.

౧. "బుద్ధిః కర్మానుసారిణీ"

౨. "స్వకర్మసూత్ర గ్రథితోహిలోకః"

అనువాక్యములను యథార్థబరుచుచుండును. ఈకర్మసూత్రమున కాద్యంతములు లేవు. ఈకర్మసిద్ధాంతము గణితశాస్త్రము వలె రుజువుగాదు. కర్మసూత్రమనగా మనుష్యుడు జేయుపుణ్యాపాపములయొక్క కార్యకారణభావమని, అల్కాటు (Olcott)దొరవారి యభిప్రాయము. ప్రతిమనుష్యునకు గలుగుసుఖదుఃఖములు తనకర్మ ఫలముగాని వేరుగాదు. "ఈబాహ్యాప్రపంచములో ప్రతికార్యమునకు నొకకారణము గలదు. అనేకకారణము లేకీభవించినపుడు వానికన్నిటికిని ప్రత్యేకఫలము కార్యమందు కనబడును. నాలు గౌషధములు చేర్చి యొకరోగికి నిచ్చినయెడల ఆనాలుగు ఔషధములగుణము రోగికి గనబడును. అటులనే మనము చేయువివిధకర్మలను బట్టి యనేక ఫలములు మనకు సంభవించును. ఏకర్మవలన నెట్టిసుఖదుఃఖములు మనకు గలుగునో; నిర్ణయించుట శక్యముగాదు. ఇహజన్మమందు గలుగు సుఖదుఃఖములు పూర్వజన్మకృత కర్మఫలములని సంక్షేపముగా జెప్పగలముగాని, ఏకర్మవలన నెట్టి సుఖదుఃఖములుగలుగునో నిర్ణయించుట మన కసాధ్యము. ఇట్టినిర్ణయము గణితశాస్త్రమందు తప్ప నితర శాస్త్రములయందు చేయలేము. ఆశాస్త్రమందు సయితము, ఖగోళములయొక్క గమనపరిభ్రమణాది విషయములలో కార్యకారణములు నిర్ణయించుట మిక్కిలి కష్టము.

ప్రస్తుత మన్ని దేశములలో నుండు ప్రజలును మనుష్యులయొక్క సౌఖ్యమును, పౌరుషముచేత నభివృద్ధి బరచి దుఃఖమును తగ్గించుటకు ప్రయత్నము చేయుచున్నారు. కర్మసూత్రమును దాటుట యశక్యమయినయెడల, స్త్రీ పునర్వివాహము, రజస్వలావివాహము, మొదలగుబనులం జేయ బ్రయత్నించుటవలన నేమిలాభమనియు,

౧. "యదభావి న తద్భావి, భావిచేన్న తదన్యథా"

౨. "అవశ్యంభావిభావానాం ప్రతీకారో భవేద్యది ।
తదా దుఃఖై ర్న లిప్యేరన్ నలరామయుధిష్ఠిరాః॥"

౩. "అవశ్యంభావినో భావా భవంతి మహతా మపి"

౪. "నగ్నత్వం నీలకంఠస్య. మహాహిశయనం హరేః"

అనువాక్యములే సత్యమయినయెడల మనుష్యుడు సర్వప్రయత్నములు మానుకుని బరమ బద్ధకుడై కూర్చుండవలసి వచ్చుననియు, గనుక కర్మసూత్రమును అంగీకరించుట క్షేమకరముగాదనియు (Foote) ఫూట్ దొరవారు పూర్వపక్షము చేయుచున్నారు. గాని వారిపూర్వపక్షము న్యాయమయినదిగా గనబడదు.

పురుషకారముచేత నైహికసౌఖ్యము నభివృద్ధి చేసుకోవచ్చును. ఆమాట సత్యమే. గాని యంతమాత్రమున పూర్వజన్మకర్మను కొట్టివేయుట సాహసము. పురుషకారము రెండువంతులనియు, దైవసంకల్పము. అనగా పూర్వజన్మకృతకర్మ "పూర్వజన్మకృతం కర్మ తద్దైవమితి కథ్యతే" మూడువంతులనియు, కొందరు గొప్పపండితులు ఒప్పిగొనుచున్నారు. కనుక సంచితప్రారబ్ధకర్మలను దాటుట శక్యముగాదు. ఆగామికర్మను పురుషకారముచే దాటవచ్చును. వ్యాధి, దారిద్ర్యము, మొదలగు బాధలు, మూడువంతులుమట్టుకు పూర్వకర్మఫలమని, యందరొప్పికొనియెదరు. గనుక వీని ననుభవించుచు, పౌరుషముచేత నీజన్మమందు సన్మార్గమందు నడిచి, యుత్తరజన్మమందు దిట్టిబాధలు లేకుండ జాగ్రత బెట్టుకోవచ్చునని కర్మసూత్రమందు విశ్వాసముగలవారు చెప్ప

దురు. కర్మ యనగా నొక దేవత గాదు. కర్మసూత్రమును మార్చుటకు మనము ప్రయత్నము చేసినను, దాని కేమి కోపము లేదు. పూర్వజన్మ యందు దుష్కర్మ చేసినవారీజన్మయం దైనను సత్కర్మ చేయుటకు ప్రయత్నించుట యావశ్యకము. గాని కర్మసూత్రమును దాటుట సులభమైనపని గాదు. ప్రయత్నముచేత కొంచెము దాటవచ్చును. అందుకు లౌకికో నిదర్శనమొకటిగలదు. భూమికియాకర్షణశక్తిగలదని మనకందరికి దెలుసును. అయినను ఊర్ధ్వగమనముకొరకు ప్రయత్నించి కొంచెము శ్రమతో భూమినివిడిచి పైకినెగరవచ్చునుగదా? అటులనే కర్మసూత్రమును కేవలము దాటుట యసాధ్య మయినను, ప్రయత్నము చేసినయెడల నాగామికర్మను కొంతమట్టుకు మార్చవచ్చును. అందుకు మరియొక లౌకిక దృష్టాంతముగలదు. కాలికి దెబ్బదగిలినవారికి గాయము లేకుండ జేయుటయసాధ్యమైన నౌషధప్రయోగమువలన శ్రమ లేకుండ జేసి గాయమును వేగము మాన్పవచ్చును. ప్రస్తుత సుఖదుఃఖములు పూర్వజన్మకర్మఫలములు. గనుక నుత్తరజన్మములో మనకు సౌఖ్యము గలుగ జేయుకర్మనే యీజన్మయం దాచరించుచుండవలయును. కర్మసూత్రమందు విశ్వాసము గలిగియుండుటవలన మరియొక లాభము గలదు. మనకుగలుగుసుఖదుఃఖము లన్నియు, పూర్వకర్మఫలములని తెలిసికొని, లేనిపోని గోజాట పెట్టుకొనక, సుఖదుఃఖములయందు సమత్వమును వహించియుండుట సంభవించును. భగవంతునికి లంచ మిచ్చినను చేయుదుష్కృతకర్మయొక్క ఫలమును తప్పించుకొనుటకు ప్రయత్నించు మూఢభక్తులకు, కర్మసూత్రమందు విశ్వాసము లేకపోయిన బాగుండును. గాని కార్యకారణభావమునే ప్రధానముగా నమ్మియున్న యాస్తికులకు కర్మసూత్రమందు ప్రామాణికబుద్ధి లేకపోవుట మంచిదిగాదు. ఈయోగమతము వారికిని, నిరీశ్వరవాదులకును, గలుగు ఖ్యభేద మేమియనిన:—

మనము చేయు కర్మలయొక్క ఫలము మన కీజన్మమందే లభించు ననియు, మృత్యువుతో మనము చేయుకర్మ సమాప్తి యగుననియు, నిరీశ్వరవాదులతాత్పర్యము.

మనముచేయుకర్మల కీజన్మమందు ప్రతిఫలము గలిగిన సరే, లేనియెడల మరియేజన్మయందైన దానిఫలము గలుగక మానదనియు, మృత్యువుచేత ప్రారబ్ధకర్మ సమాప్తి యయినను, దీనిశాఖలు త్తరజన్మలకు వ్యాపించుననియు

“నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి,”

అని యోగమతమువారి యభిప్రాయము. యోగాభ్యాసముచేత మనుష్యునియం దంతర్గతనుయి యుండు, అనేకశక్తులను వ్యక్తబరచి యనేకమహిమలను సంపాదించవచ్చుననియు పైని చెప్పబడియున్నది. అట్టియోగాభ్యాసము చేయుటకు బ్రహ్మచర్యము ప్రధాన మయినపని యని, యోగశాస్త్రమందు చెప్పబడుచున్నది. ఖేచరత్వము మొదలగుమహిమలు సంపాదించ దలచినవారు ఆజన్మాంతబ్రహ్మచర్యము జరపుచు, నూర్ధ్వరేతస్కులై యుండవలయును. ఊర్ధ్వరేతస్సు గలిగియుండుట భగవంతునికిగూడ ప్రధానగుణమని వేదమందు చెప్పబడియున్నదిగదా?

“అనంత మవ్యయం కవిం—ఊర్ధ్వరేతం విరూపాక్షం
విశ్వరూపాయ వై నమః”

ఊర్ధ్వరేతస్కుడైయుండుటచే మనుష్యున కనేకమహిమలు గలుగును. అట్టిమహిమలవుండర, యధోరేతస్కుడై యుండుటవలన గలిగెడు కళత్రసౌఖ్య మెట్టిది. అయిన నాజన్మాంత బ్రహ్మచర్యముచేయుట సృష్టికర్తయొక్క తాత్పర్యము గాదనియు, నట్లైన స్త్రీ నెందుకు సృజించెననియు (Foote) ఫూట్ దొరవారు శంక జేయుచున్నారు. గాని వారి శంక యుక్తియుక్తముగా గనబడదు. ఆజన్మాంతబ్రహ్మచర్యమును జరుపగలవారందరు కష్టబడి యట్టిమహిమను సంపాదింపవచ్చును. లేనివారు గృహస్థాశ్రమమునులో లభించెడుస్వల్పసౌఖ్యముతో సంతుష్టిపొందియుండవచ్చును. అందరు సింహాసన మెక్కగలరా? అందరికి రాజ్యాధికారము లభించునా? సామాన్యజనులు సామాన్యమార్గమందే యుండవచ్చును. విశేషజనులు విశేషమార్గమందే యుండవచ్చును. గనుకసామ

ర్థ్యముగలవారు బ్రహ్మచర్యము జరిపి మహిమలను సంపాదించవచ్చును. లేనివారు గృహస్థాశ్రమములో ప్రవేశించి తజ్జనితస్వల్పసౌఖ్యముతో సంతుష్టి పొందియుండవచ్చును.భోగాపేక్ష గలిగి గృహస్థాశ్రమములో ప్రవేశించినవారికి మోక్షప్రాప్తికి కాలవిలంబ మగును.

శ్లో॥ "యత్రాస్తి భోగో నహి తత్ర మోక్షో।
యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః"

అను ప్రసిద్ధవాక్యము గలదు గదా ? గనుక శీఘ్రముముక్షులయినవా రాజన్మాంతబ్రహ్మచర్యమును, విలంబితముముక్షులయినవారు, గృహస్థాశ్రమమును జరుపవచ్చును.

"భిన్నరుచిర్హి లోకః" అని యోగసభవారి తాత్పర్యము (Blavetsky)బ్లావటిస్కీ-దొరకాంతగారు చేయు కొన్నియద్భుతచర్యలను చూచి కొందరు పామరులు పరిహసించి యామె, మోసకత్తెగాని, మహిమలు గలమనిషి కాదని యామె నసూయచే నిందించుచున్నారు. అట్టినిందలు కేవల మన్యాయము. ఆదొరకాంతగారు చెప్పిన దేమనిన; మనుజునియం దంతర్గతశక్తు లనేకము లున్నవనియు, యోగాభ్యాసము చేనవి వృద్ధిబొంది కొన్నిమహిమలు లభించు ననియు, నట్టిమహిమలు తనకు లభించిన వనియు, నట్టిమహిమలను సంపాదించుట సాధ్యముకాని, మనుష్యుల కసాధ్యము కాదనియు, నామహిమలు విపరీతచర్యలు కావనినామె తాత్పర్యము ఇది సత్యమే.ఏవిద్యలో కృషిచేయువారి కావిద్యాసంప్రదాయములు తెలియునుగాని, ఇతరశాస్త్రసంప్రదాయములు తెలియవు గదా? అందుకు దృష్టాంతము(Tyndall)టిన్‌డాల్ దొరవారికి,రసవాదశాస్త్రముయొక్క రహస్యములు తెలుసునుగాని,యితరులకు వారుచేయుపనులు మోసమువలెకనబడును. అటులనే(Blavetsky) బ్లావటస్కీ యోగినీశిరోమణిగారు యోగశాస్త్రము ననుసరించి చేయుచర్యలు పామరులకు మోసమువలెకనబడును.యోగశాస్త్రరహస్యము తెలిసినవారికి నద్భుతముగ కనబడవు, అనియామెతాత్పర్యము.ఇకడపట వివరించవలసినయంశము మరియొకటికలదు.అదియేమనిన, ఎట్టిజీవ

రాసులయినను భూగోళమందే కలవు గాని, యితరగోళములయందు లేవని కొందరిపాశ్చాత్యపండితుల యభిప్రాయము. ఇట్టియభిప్రాయము క్రీస్తులకుచెల్లునుగాని ఇతరులకుచెల్లదు. ప్రంచమంతయు మనకొరకే సృజింపబడలేదు. ప్రంచమందున్న జీవకోటిలో మనమే యగ్రగణ్యులము కాము. మనకంటే,నధికులు, నల్పులును, కూడకలరు. మనుష్యులలో భాగ్యవంతులు,బీదలు,సురూపులు,కురూపులు ఎట్లు గలరో, యట్లనే జీవకోటిలో దేవతలు,మనుష్యులు, పిశాచములు, చతుష్పాత్తులు,పక్షులు, మొదలగుయనేకభేదములు గలవు. ఇట్టిభేదములు వారువారు జేయుకర్మతపోవశముచేత కలిగినవి.

"తపసా దేవా దేవతా మగ్రఆయన్"

తపస్సుచేత పూర్వము మర్త్యులుగా నుండినకొందరు అమర్త్యులైరి. అట్లనే దుష్కృతకర్మచేత నీజన్మములు కూడ లభించును. జన్మాంతరములైనకొలది, పురుగులకు, మత్స్యములకు,ఉత్తమశరీరము లభించునని ప్రాణశాస్త్రమందు ( Biology) చెప్పబడియున్నది. కాలక్రమమున జన్మాంతరములైనకొలది శరీర మెట్లభివృద్ధిపొందునో యట్లనే తపోవిశేషముచేత నాత్మకు పవిత్రతగలిగి, దేవసిద్ధయక్షజన్మలు లభించును. అని యోగసభవారితాత్పర్యము.

శ్లో॥ విజయ విజయరంగారాయ భూపాలమౌళే
విమలతరవిభాస్వత్కాశనీకాశకీర్తె
రతిపతిసమకాంతే, రావువంశార్ణవేందో
శమితరిజ జనార్తె శంకరస్య ప్రసాదాత్.

౨. త్వదీయపాదాబ్జనివిష్టచిత్తమ్
మదీయసంరక్షణ బద్ధదీక్షమ్
శ్రీరంగరాయాఖ్య ధరాధినాథమ్
గాధాపతే మాధవరక్షరక్ష.



శ్లో॥ అనూర్మిమత్వం దేహేఽస్మి౯ దూరశ్రవణదర్శనం
మనోజవః కామరూపం పరకాయప్రవేశనం
స్వచ్ఛందమృత్యు ర్దేవానాం సహక్రీడానుదర్శనం
యథా సంకల్పసంసిద్ధి రాజ్ఞాప్రతిహతా గతిః
త్రికాలజ్ఞత్వ మద్వంద్వం పరచిత్తాద్యభిజ్ఞతా
అగ్న్యర్కాంబువిషాదీనాం ప్రతిష్టంభో పరాజయః
ఏతా శ్చోద్దేశతః ప్రోక్తా యోగధారణసిద్ధయః.

